# తొలి పలుకు

నా విద్యార్థి దశనుండి ఆయుర్వేదము నాకభిమాన విషయము. ఆరోజుల నుండియే రోగనిదానము, చికిత్స, ఔషధముల తయారీపట్ల నాకుత్సాహము కలిగినది. ఆ ఉత్సాహము నేటి ఆయుర్వేద యోగసింధువుగా రూపొం దినది. ఈగ్రంథమును తీర్చిదిద్దుట యందు సంపాదకులు గా శ్రీ యనమండ్ర సుబ్రహ్మణ్య శాస్త్రి గారికిని, సకాల మున ముద్రించి యిచ్చిన శ్రీ వాయునందన ప్రెస్ వారికిని, ఈ గ్రంథమును వెలువరించుటకు ధన సహాయముచేసిన కీ॥ శే॥ తిక్కవరపు రామిరెడ్డి గారికిని నా కృతజ్ఞత.

ఈ గ్రంథములోని ప్రక్రియలు ఉపయోగించి ఎవరైన కొద్ది ఫలితమును పొందిననూ, నా కృషి ఫలప్రదమైనదిగా భావించగలనని మనవి చేయుచున్నాను.

కావలి, బుధజనవిధేయుడు.

20-1-1974 ఓరుగంటి వెంకటసుబ్బయ్య

**Dr. S. Ramakrishnamurthy**
G C I M.
Physician & Surgeon

*Station* NELLORE

*Date* 15-1-74

శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు, వారు వ్రాసిన పుస్తకమును నాకిచ్చి, నా అభిప్రాయము అడిగినందున ఈ క్రింది వాక్యములు వ్రాయుటకు సాహసించితిని.

శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు ఆయుర్వేదము నందు అచంచల విశ్వాసము కలిగి, ఆయుర్వేదౌషధములనే స్వయముగా వారు వాడి ఇతరులకు కూడా సలహాల నిచ్చు చుండిరి.

ఇందలి యోగములు ప్రకరణ యుక్తముగా ఉండి మహర్షిప్రోక్తములు కొన్ని, స్వానుభవము మీదకొన్ని సేకరించబడినవి. ఇందలి విశేషమే మనగా గర్భనిరోధకయోగములు, గర్భనివారణ యోగములు వేరుగా వ్రాయబడుటయే మన పూర్వీకులు కూడా గర్భనివారణోపయోగములు ఉపయోగించినారని తెల్పుటకు ఇది ఒక ఉదాహరణము

శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు వ్రాసిన పుస్తకము ఆయుర్వేదవైద్యులకు, ఆయుర్వేదమునభ్యసించు వారలకు మిక్కిలి ఉపయోగ కారిగా ఉండును.

(Sd.) S. Ramakrishnamurthy.

## OPINIONS

**Dr. Thumuluri Subbaih,** Ongole.
L M P, F I M (Regd)

D/ 22-12-73.

I have gone through most of the 'Ayurveda Yoga Sindhu', and I find it an admirable work. It is the result of study and long experience in the preparation of medicines, for the 'Pinakini Satyagraha Ashram Hospital', of which the author was incharge for five y ears. Everyone of the medicines used in the hospital, were prepared at theHospital itself are easy of preparation and most of the Yogas and the preparations can be made at home.

The book is a valuable addition to the existing liturature on the subject Every home will do well to have a copy of it. The few lines the author has given to Naturopathy, which he practised from 1896, and blood pressure, pulse and breathing and preventive treatment of cholera and small-pox make the book one of inestimable value.

(Sd.) Thumuluri Subbaiah.

**T. Seshagiri Rao**, M.A., L.I.M. H.P.A.

Research Officer (Ayurved) CCRIMH,
Member, Board of Studies in Ayurved (Andhra University)

Madras.
Date 10-11-73.

It is highly creditable that the author Sri Voruganti Venkatasubbaiah at the age of 90 thought of writing the 'Ayurveda Yoga Sindhu' and he has done it excellently well The yogas prescribed to beget children male or female accoridng to their choice, the Vrishya Yogas of Vatsyayana Kamasutras, oral contraceptives a score of them taken from charaka, yogaratnakara etc., are of particular interest. The regimens to decrease corpulence or increase of fat are a valuable addition I have no doubt that not only medical practitioners but also lay men will find the book useful.

(Sd) T Seshagiri Rao.

# విషయ సూచిక.

N B: * అవకాశము లేనందున అతిప్రధానములగు తప్పులకు ఒప్పులను ప్రదర్శించుటయే కష్టమై పోయినది. చూచియు కొన్నిటిని పాఠకలోకమునకు వదలక తప్పలేదు. మన్నింప మనవి. సం ॥



గ్రంథకర్త
ఒరుగంటి వెంకటసుబ్బయ్య



గ్రంథస్వీకర్త
తిక్కవరపు రామిరెడ్డి.

— అంకితం —

సాహితీ బంధువు, వదాన్యుడు, యశస్వి

**కీ॥ శే॥ తిక్కవరపు రామిరెడ్డికి**

స్నేహపురస్సరంగా.



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాన్తయే॥

# భూమిక

---

మానవ జాతికి ఆదిమ పరమ పవిత్ర గ్రంథము వేదము. శ్రీకృష్ణద్వైపాయన మహర్షి లోక కల్యాణార్థము వేదమును – ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, – అథర్వణవేదము అని నాలుగుగా విభజించెను.

ఈనాలుగు వేదములకు నాలుగు ఉపవేదములు కలవు. చరణవ్యూహమను ప్రామాణిక ప్రాచీన గ్రంథమున "ఋగ్వేదమునకు ఆయుర్వేదము, యజుర్వేదమునకు ధనుర్వేదము, సామవేదమునకు గాంధర్వవేదము, అథర్వవేదమునకు అర్థ (శాస్త్ర) వేదము ఉపవేదములు" అని కలదు. కాని ఆయుర్వేదమున పరమ ప్రామాణికములగు చరక – సుశ్రుత – భావప్రకాశికాది గ్రంథములయందు "ఆయుర్వేదము అథర్వవేదమునకు ఉపవేదము" అని కలదు. ఏది యేమైనను ఆయుర్వేదము ఉపవేదమనుట సర్వ సమ్మతమే.

వేదములు మానవునకు పరలోక సుఖ సాధకములు. ఉపవేదములు మానవునకు ఇహలోక సుఖ ప్రదములు. అవి పరమాత్మ స్వరూపములు. ఇవి జీవాత్మ నిర్మితములు. ఇహ పర సుఖమును కోరుట వివేకవంతుల లక్షణము. అట్టివారికి వేదములు ఉపవేదములు సమాదరణీయములు.

సుశ్రుత సంహితలో సూత్రస్థాన ప్రథమ అధ్యాయమున ఆయుర్వేదపదము ఇట్లు నిర్వచింపబడినది, "అనేన ఆయుః విందతీతి = ఆయుర్వేదః" ఈ విద్యవలన ఆయుర్దాయము తెలిసికొననగును అని అర్థము. అనగా మానవుడు ఈ విద్యవలన ఆధివ్యాధుల బారినుండి సంరక్షించుకొనుచు ఆయుర్దాయమును పెంచుకొను విధానమును గ్రహింపగల్గునని భావము.

ఈ ఆయుర్వేద వైద్యము అష్టాంగములుగ విభజింపబడినవి. 1. శల్యచికిత్స — వ్రణాదులను కోయుట, దానికి తగు సాధన నిర్మాణము. 2. శాలాక్యచికిత్స — చెవి - ముక్కు - నోరు - కన్ను - వీనికి కలుగు వ్యాధుల చికిత్స. 3. కాయ చికిత్స — సర్వాంగములయందు వ్యాపించియుండు జ్వరాతిసార ఉన్మాదాపస్మార మేహాదులకు చేయుచికిత్స. 4. భూత విద్య — భూత ప్రేత పిశాచ గ్రహబాధలకు సంబంధించినది. 5. కౌమారభృత్యం — పిల్లలకు దుష్టస్తన్య పానాదులవలన కలుగు వ్యాధులకును, బాలగ్రహాదులకును సంబంధించిన చికిత్సావిధానము. 6. అగద తన్త్రము — సర్ప వృశ్చిక మూషికాది జంతువులు కరచుటవలన కలుగు నానావిధ విషములకు సంబంధించిన చికిత్స.

7. రసాయన తన్త్రము—

ముదిమి రాకుండుటకును, ఆయుర్దాయము పెంచుటకును, సప్తధాతువులకును బలము కలిగించు ప్రక్రియను తెలుపును.

8 వాజీకరణ తన్త్రము—

వీర్య సంబంధములగు దోషములను పోగొట్టి ఇంద్రియ పుష్టిని తద్వారా తుష్టిని కలిగించు విధానము.

అతీంద్రియ జ్ఞాననిధులగు మహర్షులు ఈ అష్టాంగ, విధానమువలన మానవులకు సంపూర్ణారోగ్యము లభించునట్లు అనుగ్రహించిరి. ఈ విధానముయొక్క సంపూర్ణ ఫలము లభించుటకు కేవలము ఆయుర్వేద వైద్య గ్రంధములను చదువుట చాలదు. వివిధ దర్శన విజ్ఞానము ఆయుర్వేద వైద్యునకు అత్యవసరము.

దర్శనమనగా "దృశ్యతే అనేన ఇతి దర్శనం" అను వ్యుత్పత్తి ననుసరించి 'చూచుటకు సాధనము' అని గ్రహింపనగును. సామాన్యముగ శాస్త్రకారులు జ్ఞానైకగోచరమగు ఆత్మతత్వమును, సృష్టితత్వమును గురించి, వివరించు గ్రంథములను 'దర్శనములు' అని వ్యవహరింతురు. శ్రీ మాధవాచార్యులు 'సర్వదర్శన సారసంగ్రహము'న 15 దర్శనములను వివరించియున్నారు. అవి ఇవి. (1) చార్వాక, (2) బౌద్ధ, (3) జైన, (4) విశిష్టాద్వైత, (5) ద్వైత, (6) నకులీశ,

(7) శైవ, (8) ప్రత్యభిజ్ఞాన, (9) రసేశ్వర, (10) వైశేషిక (11) న్యాయ, (12) జైమినీయ, (13) పాణినీయ, (14) సాంఖ్య, (15) యోగ దర్శనములు. లక్ష శ్లోకసంఖ్య గల బ్రహ్మకృత ఆయుర్వేద దర్శనము నేడు లభించుటలేదు. విశ్వామిత్ర పుత్రుడని ప్రసిద్ధిగల సుశ్రుత విరచితమగు సంహితలో ఆయుర్వేద దార్శనిక విజ్ఞానము సంగ్రహరూపమున కలదు. ఆయుర్వేదమునకు సంబంధించిన పదార్థవిజ్ఞాన-రసాయన - జీవ- శరీరాది శాస్త్ర సిద్ధాంతములు అన్నియు దర్శన విజ్ఞానముపై ఆధారపడియున్నవి.

సంస్కృతభాషా పాండిత్యము సంపాదించి సకల దర్శన విజ్ఞానమును గ్రహించి తరువాత ఆయుర్వేద వైద్య గ్రంథములను సాంగోపాంగముగ పఠించి ఉపయోగమున నైపుణ్యమును ప్రదర్శింపగలవాడే ఉత్తమవైద్యుడు కాగలడు.

## ఆయుర్వేద సంగ్రహ చరిత్ర

భారతదేశమున ఆయుర్వేదము అతి ప్రాచీనకాలమునందే సర్వతోముఖముగా వికసించినది.

### అశ్వినీకుమార సంహిత—

ఇది స్వాయంభువ మన్వంతరమందలి ప్రథమ కృతయుగము నాటిది. అది ప్రాచీనము, బృహత్కాయము కలది. ఇందు ఒక లక్ష 20 వేల శ్లోకములు కలవు. వ్యాధి నిదాన చికిత్సా పథ్యాదులేకాక సృష్టి - ప్రకృతి వికృతి వర్ణనలు కలవు.

బ్రహ్మసంహిత

ఇది 24 వేల శ్లోకములుగల గ్రంథము. త్రేతాయుగమునందు వాడుకలోనున్నట్లు ప్రసిద్ధి. మూడు ప్రకరణములు కలవు. బ్రహ్మ నారద సంవాదరూపమున ఉండును. రోగములు కలుగుటకు కారణములు, వ్యాధుల భేదములు, ఔషధములు చెప్పబడినవి.

మేషసంహిత—

16 వేల శ్లోకములుగల ఈగ్రంథమున రెండు ప్రకరణములు కలవు. వ్యాధులు-ఓషధులు-వీటి వివరములు సమగ్రముగ ఉన్నవి.

పుష్కల సంహిత—

స్వారోచిష మన్వన్తరమందు 3వ సత్యయుగమున పుష్కలమహర్షి చే రచింపబడినది. 32 వేల శ్లోకములు కలవు. ఇందు సామాన్యమగు ఆధి-వ్యాధి-నిదాన- చికిత్సలు చెప్పబడినవి, ఆహార విహార నియమములను పాటింపకపోయిన కలుగు వ్యాధులు వివరింపబడినవి. కర్మవిపాకాంశ ఈగ్రంథమందు పుష్కలముగనుండి ఒక విధముగ ప్రత్యేకతతో ప్రకాశించుచున్నది.

ఇట్లే అతి ప్రాచీనకాలముననే — అగ్నిధ్రసూత్రరాజము (56 వేల శ్లోకములు) ఖర్ణకప్రశ్న (12 వేలు) ధాతువాదము (60 వేలు) ధన్వన్తరిసూత్రము (20 వేలు) మానసూత్రము

(12 వేలు) సూపశాస్త్రము (62 వేలశ్లోకాలు) సూభరిసూత్రము (12 వేలు) దాల్భ్యసూత్రము (10 వేలు) జాబాలిసూత్రము (14 వేలు) ఇంద్రసూత్రము (8 వేలు) శబ్దకౌతూహలము (24 వేలు) దేవలసూత్రము (15 వేలు) శేషనారాయణకృత వనస్పతి-చంద్రోదయము, అంగీరసకృత వనస్పతివివరణము దాల్భ్యనిఘంటువు చ్యవనమహర్షి విరచిత రూపార్ణవము, గణేశకృత రసప్రభాకరము, మరీచికృత రసార్ణవము — నేటి భారతీయ చరిత్రకారులకు అందని అతి ప్రాచీనకాలముననే లోకకల్యాణార్థము రచింపబడినవి.

కనిష్క మహారాజుయొక్క ఆస్థానవైద్యుడని కొందరిచే చెప్పబడుచున్న చరకమహర్షి ఒక సంహితను రచించెను. ఇతడు B. C. 5వ శతాబ్దమువాడని కొందరందురు. నేడు ప్రచారములోనున్న ఆయుర్వేద వైద్యగ్రంథములలో ఈ సంహిత అతి ప్రాచీనమైనది, మహత్వమైనది. ఇందలి చికిత్సా విధానము మిక్కిలి ప్రశంసనీయమని పాశ్చాత్య పండితులు ప్రశంసించిరి.

సుశ్రుతుడను మహర్షి ఒక సంహితను రచించెను. ఇది ఒక మహాగ్రంథము. ఇందు శల్యచికిత్స అత్యధిక వైజ్ఞానికముగా వర్ణింపబడినది. తలవెంట్రుకఅంతటి రక్తనాళమును నిలువునా నాలుగుభాగములుగా చీల్చతగినంతటి సున్నితము పైన, పదునైన త్రుప్పుపట్టని సాధనములను కనిపెట్టిన గొప్ప

పరిశోధకుడు సుశ్రుతుడు. ఏ ఏ సాధనము (Surgical Instrument) ఏ ఏ లోహ మిశ్రమముతో తయారు చేయవలసినది, ఏ సాధనము ఏ ఆకారములో ఉండవలసినది గర్భస్థ మృతశిశువును ఎటువంటి సాధనములతో బయటకు తీయవలసినది సువిపులముగ వివరించిన మహా మేధావి సుశ్రుతుడు.

వాగ్భటుడను మహాశయుడు రచించిన అష్టాంగ హృదయ సంహిత ప్రశంసనీయమైనవి.

ఈవిధముగ 3, 4 శతాబ్దములనుండి ఆయుర్వేదము పరిశీలన పరిశోధనములతో సుసమృద్ధముగ అభివృద్ధి నొందినది. ఎందరో మహానుభావులు అనేక గ్రంధములను రచించిరి. కేవలము రోగకారణములను వివరించుటలో ప్రశస్తమైనది మాధవ నిదానము.

ఆధునిక యుగమున భావ ప్రకాశిక శారంగధర సంహిత, భైషజ్యరత్నావళి, బసవరాజీయము, యోగరత్నావళి ఇత్యాది మహాగ్రంధములు ఆయుర్వేదమార్గమును సుగమము చేసినవి.

8వ శతాబ్దమున (712-75) మహమ్మదీయ దండయాత్రలలో రాజులతో పాటు హకీంలు కూడ భారత దేశమునకు వచ్చి కొంతకాలమిటనుండి ఇచటి పండితులవలన ఆయుర్వేద వైద్యమును నేర్చుకొని తమ దేశములకు వెళ్లిరి వారు ఆ మందులకు పేర్లను మార్చినను ఔషధములు చేయు విధాన

మిదియే. ఈవిధముగ ఆయుర్వేదము నామాంతరములతో దేశాంతరముల ప్రవేశించి వారిని సంరక్షింపసాగినది. ఆ యూనానీ వైద్యము నేటికిని అరబ్ దేశములలో ప్రచారము లో ఉన్నదట.

## ప్రస్తుతపరిస్థితి

ఆంగ్లేయుల పరిపాలన భారతీయ కళల పాలిట ధూమ కేతువు అయినది. పరవనితానురక్త హృదయుడు స్వభార్య యందు విముఖుడగునట్లే భారతీయులు ఆంగ్లవిద్యావైద్య సంప్రదాయవ్యామోహితులై భారతీయ విద్యావైద్య సంప్ర దాయములందు విముఖులైరి.

ప్రభుత్వాదరణ ప్రజాదరణ కల ఆంగ్లవైద్యము అన్ని రంగములయందును వివృద్ధమైనది. ఆరెండును లేని ఆయు ర్వేదము అభివృద్ధిలేక పోవుటయేగాక (పరిశోధనాదులు) ఉన్నది, జరిగినది కూడ నశించి క్రీస్తుపూర్వమందు ఉన్నట్లే ఉన్నది.

నేడు అచ్చటచ్చట ఆయుర్వేద కళాశాలలు ఉన్నను అచట బోధింపబడునది మూడువంతుల ముప్పాతిక ఆంగ్ల వైద్యమే. అచటతయారయిన ఆయుర్వేదవైద్య విద్యార్థులు ఏ మునిసిపల్ లేక పంచాయతీసమితి ఆయుర్వేద ఆసుపత్రిలో నైన వైద్యులుగ చేరినను ఆయుర్వేద ఔషధములు వాడరు, వాడలేరు.

దైవవిశ్వాసము లేనివారు దేవాలయాధికారులుగ
నియమింపబడుచున్నట్లే, ఆయుర్వేదాభిమానము లవలేశ
ము కూడ లేనివారే ఆయుర్వేద వైద్యశాలలయందు వైద్యు
లుగ నియమింపబడుచున్నారు. ఇట్టివారివలన ఆ వ్యవస్థలకు
ఎంతటి అపకారము, అప్రతిష్ఠ కలుగుచున్నదో మాటలలో
చెప్పుట కష్టము.

భారత దేశ వాతావరణమునకు అన్నివిధముల సరి
యగునది. ఆయుర్వేద వైద్య విధానము. ఎవరు ఎంత
హీనముగా భావించినను నేటికిని ఆయుర్వేదము సజీవమే
అంతేకాదు ఆంగ్లేయవైద్యవిధానముకంటె గొప్పదని (ఒక్క
ఆపరేషనులో తప్ప) ఘంటాపథముగ చెప్పవచ్చును.
ఆంగ్ల ఆయుర్వేద వైద్యవిధానములను తులనాత్మక పరిశీలన
చేసి చర్చించిన, ఆంగ్లవైద్యమందలి అవగుణములను పదుల
సంఖ్యలలో పేర్కొనవచ్చును. కాని గ్రంథవిస్తర భీతి
విరమింపచేయుచున్నది.

ఒక్కొక్క రోగికి ఎచ్చటను రోగము తగ్గకపోయిన
"ఆయుర్వేద వైద్యము చేయించుకొనుము" అని పెద్దలు
పలుకుచుందురు నిజమే. ఆంగ్లవైద్యమునకు తగ్గని అనేక
వ్యాధులు ఆయుర్వేదమువలన తగ్గుచుండుట ప్రత్యక్ష సిద్ధమే.
ఇదియే ఆయుర్వేదపు ఘనతను తెలియచేయుచున్నది.

రసాయనికపు ఎరువులు భూమిని గుల్లచేయుచున్నట్లే
అల్లోపతి మందులు మన ఇల్లు ఒళ్ళు గుల్లచేయుచున్నవి.

అయినను ఆయుర్వేద వైద్యులు అరుదైనందున, ఈ ఆసుపత్రులచుట్టు త్రిసంధ్యల ప్రదక్షిణములు చేయుట మన వారికి తప్పటు లేదు, తప్పదుకూడ.

అట్లని ఆయుర్వేదము నశించినదనిగాని నాశనోన్ముఖమనిగాని తలంపరాదు. వైద్యులు లేకపోయినను, వైద్యశాలలు అరుదైనను సంవత్సరానికి 25 కోట్ల రూపాయల ఆయుర్వేదౌషధముల వ్యాపారము జరుగుచున్నదని భారత ప్రభుత్వము (Sales tax) లెక్కల ఆధారముగా ప్రకటించియున్నది. అచ్చటచ్చట వైద్యులు స్వయముగా తయారుచేసి వాడు మందులు ప్రభుత్వపు లెక్కలలోనికి రావు. అట్టివి మరి 10,15 కోట్లకు తగ్గదు. ఏ ప్రచారము లేకుండగనే ఇంతటి వ్యాపారము సాగుతున్నదంటే, అన్ని హంగులు కల అల్లోపతి కంటె ఆయుర్వేదమునకు ప్రజలలో అధికాదరము కలదని గ్రహింపవచ్చును.

ఆయుర్వేద విషయమున రెండు ఆక్షేపణలు సామాన్యముగా వినబడుచుండును. అందు మొదటిది — "ఆయుర్వేద మందులు తొందరగ పనిచెయ్యవు. నెలలతరబడి వాడవలసియుండును."

దీనికి సమాధానము — ఏ వైద్యమునందైనను బలవర్ధకౌషధములు జీర్ణరోగములకు మందులు నెలలతరబడి వాడవలసియేయుండును. జ్వరాతిసార వమనాదులకు క్షణములో పనిచేయు మందులు ఆయుర్వేదమునను కలవు. కొంత

కాలమునుండి కొందరు ఆయుర్వేద పద్ధతిపై ఇంజెక్షనులను తయారు చేయుచున్నారు ఔషధ సేవనా సమయమనునది వ్యాధి స్వరూపస్వభావములపైనను, రోగి దేహస్థితిపైనను, కొలదిగ వైద్యుని సమయజ్ఞతపైనను ఆధారపడియుండును. వైద్యవిధానము అతిస్వల్పమే.

రెండవ ఆక్షేపణ — "ఆయుర్వేదమందులకు పథ్యా లుండాలి. లేకపోతే కాళ్లు పడతాయి" అని. దీనికి సమాధానము — పథ్యము అనునది మందులకా? రోగమునకా? మందులకయిన, అన్నిమందులకు ఒకే పథ్యము ఉండవలెను ఆ విధముగా లేదు. అంతియ కాక పథ్యముచేయనపుడు ఆ మందు పనిచేయకూడదు. ఇదియు అనుభవ విరుద్ధమే. ఇక రోగమునకే పథ్యము అని భావింపవలసి యున్నది. అట్లయిన పథ్యమనునది ఏవైద్యవిధానమునందైనను అవసరమే కదా! ఈవిషయమున ఒక ఉదాహరణ — అజీర్ణ రోగికి శనగ పెసర, మొదలగు పప్పులను, వాటితో చేయు పిండివంటలు, మాంసమును అమితముగా, బలవంతముగా తినిపించుచు అల్లోపతిమందులను వాడినను, ఇంజెక్షన్ చేయించినను ఆపరేషన్ చేయించినను రోగమునకు బదులు రోగియే కృశించి మాయమగును గదా! ఈవిధముగా పరిశీలించి చూచిన పథ్యము అనునది వ్యాధికే గాని మందుకు కాదని స్పష్టమగును.

రసవిషగంధకాదులు కలిసిన మందులకు పథ్యము తప్పదని వృద్ధవైద్యులు పలుకుదురు. ఇదియు సంపూర్ణముగా సత్యము కాదు. రసగంధకాదులు కలియుమందులను పథ్య రహితముగా నేను సేవించి చూచితిని. 16 సంవత్సరములుగ అనేకులకు వాడుచున్నాను. నాకుగాని మరియెవ్వరికినిగాని కాల్లుపడలేదు సత్ఫలితమే లభించినది, లభించుచున్నది నా అనుభవము ఇది.

అయినను ఔషధము సంపూర్ణ ఫలప్రదమగుటకు ఏ మందులకైనను పథ్యము చేయుట మంచిది. రోగము రాకుండుటకును, రోగనివృత్తికిని ఆహారవిహారనియమము పాటించుట మంచిది. ఇది కాదనరాని సత్యము. పథ్యమను భీతితో ఆయుర్వేదమునకు దూరము కానక్కరలేదు. కాస్త ఆలస్యమగునేకాని ప్రమాదము కలుగదు.

## ఇక ప్రస్తుత విషయము

ఈ గ్రంధకర్తయగు శ్రీ ఓరుగంటి వేంకటసుబ్బయ్య గారు 92 సంవత్సరముల వృద్ధులు. వీరి చరిత్ర ముందు విన్న వింతును వీరు భారతజాతీయోద్యమ సమయమున గ్రామ గ్రామమున కాంగ్రెస్ ప్రచారార్థము తిరుగునపుడు వైద్యము లేక దుఃఖించు దీనుల దీనస్థితికి వగచి తాను విన్నవి, కన్నవి,—చిట్కాలు, యోగములు ఆచరణమున పెట్టి ఆయుర్వేద వైద్యమున అనుభవము సంపాదించిరి. ఇదంతయు వారి

స్వానుభవమే. కాని ఇందలి కొన్ని యోగములు బసవ రాజీయాది గ్రంథములలో కలవు బహుశ వాటిని పండితులు వీరికి చెప్పియుందురు. వీరు వాటిని పలుమారులు పలుతావుల ఉపయోగించి స్వాధీనము చేసికొనిరి. 1921 లో వీరు తన డైరీలలో వ్రాసికొన్న విషయమే ఇది దీనిని పరిష్కరించి ముద్రింపించు భారము నాపైనుంచిరి. అపరిణత ప్రజ్ఞకల వాడనైనను పెద్దల ఆజ్ఞను శిరసా వహించితిని. యథామతి యథావకాశం సరిచూచితిని. పొరపాటులుండవచ్చును. అవి నావి. క్షంతవ్యములు. ఒప్పులు పెద్దలవి. సమాదరణీయములు. ఇందు రసవిషగంధకాదుల ఉపయోగము కలమందులు లేనందున ఆయుర్వేదాభిమానులలో అవకాశము ఉన్నవారు సులభముగ తయారు చేసికొని యథేచ్ఛగా వాడుకొనవచ్చును. నిరపాయకరములగు యోగములు.

సాధ్యమైనన్ని పారిభాషికపదములకు వివరణములు గ్రంథాంతమున ఇవ్వబడినవి.

లోకాః సమస్తాః సుఖినోభవంతు.
ఓం తత్ సత్

"ఆయుర్వేద వైద్యాచార్య"

విజయదశమి, ప్రమాదీచ కావలి. } యనమండ్ర సుబ్రహ్మణ్యశాస్త్రి M. A.
విద్యాప్రవీణ (సంస్కృతము)
భాషాప్రవీణ (తెలుగు)
భాషాప్రవీణ (హిందీ)

# శ్రీ ఓరుగంటి వేంకటసుబ్బయ్యగారి సంగ్రహ జీవిత చరిత్ర

శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు 1882 సెప్టెంబరులో కావలి గ్రామమున జన్మించిరి. వీరి జనకులు శ్రీ లక్ష్మీనారాయణప్ప గారు. జనని కామాక్షమ్మ గారు. వీరి తండ్రితాతలు గొప్ప న్యాయవాదులుగను, నిరతాన్న ప్రదాతలుగను ప్రసిద్ధి పొందినవారు. అటువంటి సుసంపన్న కుటుంబమున జన్మించిన శ్రీ వెంకటసుబ్బయ్యగారు కావలి, నెల్లూరు, రాజమహేంద్రవరములలో పాఠశాలా కళాశాలా విద్యలను సాధించి, మద్రాసు-లా కాలేజిలో న్యాయశాస్త్ర విద్యను పూర్తిచేసి 1905 నుండి 17 వరకు న్యాయవాదిగ పనిచేసిరి.

విద్యాభ్యాసకాలముననే వీరికి ఆయుర్వేదవైద్యమున ఆసక్తి-అభిమానము కలిగెను. తాను అభిమానించు విషయమును, తాను నమ్మిన సత్యమును పదిమందికీ తెలియజేసి నచ్చచెప్పి తత్సుఫలమును పదిమందిచేతను అనుభవింప చేయవలెనను పట్టుదల కొందరిలో సహజముగనుండును. అట్టి తరగతికి చెందిన వీరు రాజమహేంద్రవరములో చదువుకొనుచునే ఆయుర్వేద ఔషధశాలను నెలకొల్పిరి. మందుల విక్రయమే కాక చికిత్సయు చేసెడివారు. కొన్ని అసాధ్యము అగు వ్యాధులు వీరి హస్తౌషధప్రభావములవలన సులభముగ నయమైనవి. ఆ విజయము వీరికి ఆయుర్వేదమున దృఢ

విశ్వాసము కలిగించుటయే గాక నూతనోత్సాహము కలిగించినది.

వైద్యవిద్యాభిమానమువలె రాజకీయాభిమానము వీరికి విద్యాభ్యాసకాలముననే కలిగినది. వీరు మెట్రిక్యులేషన్ చదువురోజులలో బ్రిటిష్‌వారు 'లోకమాన్య' బాలగంగాధర తిలక్ గారిపై రాజద్రోహ నేరము మోపిరి. ఈ సంఘటన దేశమందు అంతట కలవరమును, దేశభక్తులలో వ్యధను, నవయువకులలో దేశస్వాతంత్ర్యకాంక్షను కలిగించెను. ఆ కేసు విచారణావివరములను 'హిందూ' దినపత్రికలో ప్రతిదినము చదువుచుండుటవలన వీరి మనస్సు రాజకీయములవైపు ఆకర్షితమైనది. దేశభక్తి, స్వాతంత్ర్యసంపాదనేచ్ఛ, సంఘసేవాభిలాష, పావనగౌతమీతీరాననే వీరిలో చిగురించినవని గ్రహింపవచ్చును. తన సదాశయసాధనకు కొందరివలె తన విద్యాభ్యాసమును బలి చేయలేదు. విద్యను నేర్చుచునే మహదాశయపూరిత భావిజీవితమునకు రూపురేఖలను దిద్దుచు, జటిలములగు సమస్యలను గురించి తీవ్రముగ ఆలోచించి తగు నిర్ణయములను గైకొనుచు, తన పరిధిలో యథాశక్తిగ, యథావకాశముగ కృషి చేయుచుండిరి. 1899 లో విదేశీయ వస్త్రధారణను విసర్జించిరి. తమ మిత్రుల చేతను విసర్జింపచేయించిరి.

1904 లో మద్రాసునందు జరిగిన ఒక సమావేశమునందు "స్వదేశప్రభువులు స్వదేశవస్తువులనే తమ సంస్థానములలో వాడునట్లు చేయవలెను" అను తీర్మానమును వీరు ప్రతి

పాదించిరి. 1905 లో జరిగిన బెంగాల్ విభజన, బెనారస్‌లో జరిగిన జాతీయ మహాసభయు వీరు మరింతగ స్వదేశవస్త్రప్రచారము చేయుటకు తోడ్పడినవి. బంధుమిత్రాదులకే కాక కనుపడిన వారందరికిని విషయమును వివరించి నచ్చచెప్పి, వారు స్వదేశప్రమాణమును చేయునట్లు చేసి విదేశవస్తుబహిష్కరణకు అహర్నిశలు కృషిచేసిరి. ఆసమయముననే కావలిలో స్వదేశవస్త్రముల అంగడిని నెలకొల్పిరి. 1910 నుండి 17 వరకును భజనసమాజములను ఏర్పరచి నగరసంకీర్తనముల వలనను, చతుష్పథములందు ఉపన్యాసములవలనను ప్రజలలో జాతీయోద్యమముపట్ల శ్రద్ధాభక్తులు పెరుగుటకు రేయింబవళ్లు శ్రమించిరి.

శ్రీ వేంకట సుబ్బయ్య గారు 1917వ సంవత్సరమున కావలిలో న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి సకుటుంబముగ నెల్లూరు చేరిరి. ఈ సమయముననే 'అనిబిసెంట్' వనితామణియొక్క "హోంరూలు ఉద్యమము" ప్రారంభమైనది. వీరు నెల్లూరు పట్టణమున కడు సాహసముతో "హోంరూల్ లీగ్"ను ఏర్పాటు చేసిరి. దానికి కార్యదర్శిగానుండి ఊరేగింపులు, సభలు, సమావేశములు జరుపుచు దాని లక్ష్యములను ఒక్క నెల్లూరు పట్టణమునందేకాక ఆ నేక పరిసరగ్రామములలో ప్రచారము చేసిరి, అదే సంవత్సరమున జరిగిన "నాగులవెల్లటూరు" జిల్లాకాంగ్రెస్ సభకు అధ్యక్షత వహించిరి. 1921లో మహాత్మాగాంధీ తరువాత బాబూ రాజేంద్రప్రసాద్, జవహర్ లాల్ నెహ్రూలు నెల్లూరు

జిల్లా పర్యటన సమయమున జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు గానున్న వీరు వారితోడ పర్యటించి ఉత్తమ కాంగ్రెస్ కార్య కర్తగా వారలచే ప్రశంసింపబడిరి.

అఖిల భారత కాంగ్రెస్ మహాసభలు బొంబాయిలో జరిగినపుడు నెల్లూరుజిల్లా తరపున ఏకైకప్రతినిధిగ శ్రీ వెంకట సుబ్బయ్య గారు వెళ్ళిరి ఆ సమయముననే 'విశ్వదాత' శ్రీ కాశీనాధుని నాగేశ్వర రావు, శ్రీ న్యాపతి సుబ్బా రావు గారు, పండిత డి. గోపాలాచార్యులు గారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు మొదలగు దేశభక్తుల పరిచయము కలిగినది, అప్పుడే శ్రీ బాలగంగాధర తిలక్ మహాశయునితో వివిధవిషయములనుగూర్చి చర్చించు అవకాశము లభించినది. ఈ అవిరళ పరిశ్రమవలన క్షయవ్యాధికి గురియైనారు. స్వయముగనే ఆయుర్వేద ప్రకృతిచికిత్సలను చేసికొని ఆంధ్రదేశ సౌభాగ్యమువలన ఆ దారుణవ్యాధిబాధనుండి విముక్తులైరి.

తరువాత కొలదికాలముననే మహాత్మాగాంధీ అసహాయోద్యమమునకు పిలుపునిచ్చిరి దానినందుకొని తన అనారోగ్యమును కూడ లక్ష్యపెట్టక జిల్లాయందంతట అతితీవ్రప్రచారము కొనసాగించిరి. ఈ ప్రచారప్రభావమున ప్రభుత్వము యొక్క అబ్కారీ ఆదాయము రెండు లక్షలనుండి రెండు వందలకు దిగినది. ఈ నిర్విరామ మహోద్యమమున శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారు, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య గారు అపారముగ సాయపడిరి. (బహుశ అప్పుడు వీరిద్దరు జిల్లా కాంగ్రెస్ కార్యదర్శులనుకొందును) మద్యపాన నివారణయం

దును, ఖద్దరు ప్రచారమునందును నెల్లూరుజిల్లా ప్రథమస్థానమును పొందుటకును. శ్రీయుతులు రామిరెడ్డి రాఘవయ్యగార్లు నరనారాయణులవంటివారని శ్రీ వెంకటసుబ్బయ్యగారే నాతో చెప్పియున్నారు.

పన్నుల నిరాకరణ ఉద్యమమున "జిల్లాకాంగ్రెస్ ఉత్తరువు లేనిదే ప్రభుత్వమునకు పన్నులు చెల్లించరాదు" అని ఒక నోటీసు ప్రతిగ్రామసంఘమునకు పంపబడెను. ఈ కారణమువలన వేంకటసుబ్బయ్యగారిని ప్రభుత్వము శ్రీకృష్ణ జన్మస్థానమునలంకరింప చేసినది ఒక సంవత్సరము. ఆ సమయముననే ప్రభుత్వము వీరి న్యాయవాదవృత్తికి సంబంధించిన 'సనద్'ను రద్దు చేయవలెనని ప్రయత్నించినది. కాని అత్యున్నత న్యాయస్థాన శాసనమువలన ప్రభుత్వపు పథకము భగ్నమైనది.

1927 వ వత్సరమున నెల్లూరుమండలము తీవ్రమగు పెనుతుఫానుకు గురియైనది. పండలాది యిండ్లు, పశువులు నాశనమైనవి. జననష్టము కలిగినది. శవములనెత్తి పారవేయుటకూడ దుర్లభమైనది. దీనికి తోడు కావలిప్రాంతమున కలరా వ్యాధి విజృంభించినది. ఈ పరిస్థితులనుండి ప్రజలను రక్షించుటకు, పునరావాసము కల్పించుటకును వందమంది స్వచ్ఛంద సేవకులను సమకూర్చుకొని వీరు సహాయకార్యక్రమమును సాగించిరి. కలరా వ్యాధిగ్రస్తులకు మందులు, ఆహారము, చంటిబిడ్డలకు పాలడబ్బాలు మొదలగునవి విరివిగా పంచబడినవి,

కన్నతల్లివంటి ప్రకృతియే ఆగ్రహించి ఉగ్రరూపమును ధరించి మారణహోమము ప్రారంభింప మానవుడు చేయు గలదేమి? అట్లని ఊరకుండుట సజ్జన లక్షణము కాదు గదా! “సంఘసేవాతత్పరులు అసలె ఊరకుండలేరు. శ్రీ వెంకట సుబ్బయ్య గారు అత్యల్పసంఖ్యాక సహాయకులతో కూడ కలరా వ్యాధినివారణకు గ్రామగ్రామమునకు తిరిగి ఆయుర్వేద ఔషధములను పంచిపెట్టి కొందరికి దగ్గర ఉండి చికిత్సచేసి ప్రాణములను కాపాడిరి. కొందరికి సలహాలను, మందువాడు విధానమును తెల్పుచు, అత్యధిక పరిమాణములో మందులను తయారుచేయుచు నిర్విరామకృషి చేసిరి వీరి ఔషధప్రయత్నములకు భయపడి యేమో వ్యాధి పలాయనసూత్రమును పఠించినది. ప్రజలు వీరిపై చల్లని దీవెనలను ప్రశంసావర్షములతో పాటు కురిపించిరి, “దైవం మానుష రూపేణ” తోడ్పడునని గదా మన విశ్వాసము.

రెండేండ్ల తరువాత వీరు కావలియందు “ఖద్దరు విక్రయ శాలలు” ప్రారంభించిరి. గ్రామమున ఖద్దరు నూలు వడకుటకును నేయుటకును అవకాశములు కల్పించి ప్రచారము చేయనారంభించిరి. అది ఒక మహోద్యమం. ఖద్దరు బట్టలను బుజాన వేసికొని దేశభక్తిగీతములను పాడుచు ఇంటింటికి వెళ్ళి ప్రచారము చేయుట మొదలుపెట్టిరి. సాధ్వీమతల్లియగు వీరి అర్ధాంగి మహాలక్ష్మమ్మగారు సంపన్నగృహిణియైనను నిరాడంబరముగను ఉన్నతవిద్యాసంస్కారవతియైనను నిరభిమానినిగా బండలవంటి ఖద్దరుబట్టలను బుజాలపై వేసికొని

పాడుచు ఇంటింటికి వెళ్ళి ఖద్దరుధరించమని ప్రార్థించువారట. తాదృశ సతీమతల్లి యగు శ్రీ దేశభక్త రంగయ్యగారి ధర్మపత్ని శ్రీమతి శేషమ్మగారు ఆనాటి విషయమును నాతో చెప్పుచు ఆనంద బాష్పపూరిత నేత్రయై "మహనీయురాలు. అట్టి త్యాగమూర్తులు అరుదుగ జన్మింతురు" అన్నారు. నేటికి 60 సంవత్సరములు దాటినవారు తప్ప ఆ పుణ్యమూర్తిని చూచినవారిచట లేరు.

స్త్రీ శక్తిస్వరూపిణి అని వేదశాస్త్రపురాణములు ఘోషించుచున్నవి. శక్తి లేని పురుషుడు దేనిని సాధింపలేడు గదా! పురుషుని జీవితం అర్థభాగమే. స్త్రీ ఆ సగమును పూర్తి చేయును. పురుషుని జీవితం తమోమయమే స్త్రీ అట్టి జీవితమునకు వెలుగునిచ్చును. పురుషుని జీవితం బలోత్సాహరహితం. స్త్రీ పురుషునికి బలోత్సాహములను ప్రసాదించును. మన 54 పురాణములు ఏకగ్రీవముగా బోధించు విషయమిది ఏ పురుషుడైనను ఒక మహాత్కార్యమును సాధించిన, అందు ప్రత్యక్షముగనో పరోక్షముగనో స్త్రీ ప్రేరణ-ప్రోత్సాహము-శక్తి ఉండక తప్పదు. ఈ సూత్రమున కపవాదముగ శ్రీ జగద్గురు శంకరాచార్యులవంటివారు అరుదుగ కన్పింతురు. ప్రకృతమున శ్రీ ఓరుగంటి వేంకటసుబ్బయ్యగారు ఇన్నిరంగములలో అవిరళకృషి చేయుటకు ఆ చల్లని తల్లియే ప్రధానకారణమని నా భావన. నేటి నారీలోకమునకు ఈ నారీమణి ఆదర్శనారీమణి, స్వర్గమందున్న దేశభక్తి

ప్రిపూరితురాలగు ఆ సాధ్వీలలామ దేశభక్తులకు ప్రాతఃస్మర ణీయురాలు. సందేహము లేదు.

[రాజమహేంద్రవరమున శ్రీ మందేశ్వరశర్మగారు ప్రక టించిన "ఆంధ్ర వీర సంస్మరణ కుసుమాంజలి" నుండి మహా లక్ష్మమ్మగారి సంగ్రహ జీవితచరిత్రను యథాతథముగ వ్రాయుచున్నాను. సం.]

## ఓరుగంటి మహాలక్ష్మమ్మ – నెల్లూరు

ఈమె నెల్లూరు జిల్లాలో సుప్రసిద్ధ బ్రాహ్మణులగు శ్రీ తూములూరి శివకామయ్యగారి పుత్రిక. ఈమె తమ్ముడు శ్రీ శివరామయ్యగారు నెల్లూరులో సుప్రసిద్ధన్యాయవాది. ఈమె 1895 లో సుప్రసిద్ధ న్యాయవాదియగు శ్రీ లక్ష్మీ నారాయణప్పగారి కుమారుడగు శ్రీ వేంకటసుబ్బయ్యగారిని వివాహమాడెను ఈమె చిన్ననాటనే ధైర్యసాహసములను, దేశభక్తిని ప్రకటించుచుండెడిది. త్రికరణ శుద్ధిగా నమ్మిన సిద్ధాంతములను ఆచరణయందుంచుటలో మిక్కిలి పట్టుదల, ఉత్సాహము ప్రకటించుచుండెడిది. పిమ్మట భర్తతో కలసి జాతీయోద్యమములో పాల్గొని ప్రజాక్షేమమునకు పాటు పడెను.

శ్రీ వేంకటసుబ్బయ్యగారిచే కావలిలో స్థాపింపబడిన అన్నదానసమాజ విషయమున ఈమె అమిత శ్రద్ధవహించుచు తానే ప్రతివారము స్వయముగ అన్నమువండి బీదలకన్నదా

నము చేయుచుండెను, 1910 లో కావలిలో మహిళా సమాజము నెలకొల్పి ఆ సమాజమునకు కార్యదర్శిగా పనిచేసెను.

ఈమె గొప్ప సంస్కరణాభిలాషిణి, 1914-15 సంవత్సరమున కావలిలో స్త్రీ పునర్వివాహ విషయములలో పుష్పగిరి స్వామివారి ఆంక్షకును, సనాతనుల బహిష్కారమునకు గురియైనను ధైర్యముగా ప్రతిఘటించెను,

1921 వ సంవత్సరములో సహాయ నిరాకరణోద్యమ ప్రారంభమున స్త్రీల కాంగ్రెస్ సంస్థాపకులలో ఒకరుగ నుండెను. తన కుమారులతోను, కుమార్తెలతోను వీధుల వెంబడి తిరిగి ఖద్దరు విక్రయించుటలోను, సారాయిదుకాణముల వద్ద పికెటింగ్‌లోను, విదేశవస్త్ర బహిష్కరణోద్యమము లోను మిక్కిలి శ్రద్ధతో ప్రచారము చేసెను.

1930 సంవత్సరములో మైపాడు, గోగులపల్లెలలో ఉప్పుసత్యాగ్రహమున పాల్గొనెను. ఈ సందర్భముననే గాక కల్లంగళ్ళవద్ద పికిటింగ్ చేయుటచే ఆరుమాసముల కారాగార శిక్ష ననుభవించెను.

1932 లో విదేశవస్తు బహిష్కరణోద్యమమున నిషిద్ధ కరపత్రములను రంగనాయకుల తిరునాళ్ళ సమయమున పంచిపెట్టినందుకు ఒక వేయిరూపాయిల జుల్మానా, ఆరు నెలల చెరసాల శిక్షకు పాత్రురాలయ్యెను. ఈమెతోకూడ ఈమె కుమాళ్లు వెంకటేశ్వరశర్మ, రామచంద్రయ్య గార్లు కూడ (జైలు) శిక్షననుభవించిరి.

1932 లో కారాగారమున నున్నపుడే నరములజబ్బు కనుపించి క్రమముగ అది పక్షవాతముగ పరిణమించినది. 1942 లో భర్తను అకస్మాత్తుగ డిటిన్యూగ తీసికొని పోవుట చేత ఆమెకు ఆదొక పెద్ద ఆఘాతమై పక్షవాతం గట్టిగనే నాటుకున్నది. ఆ డిసెంబరులోనే కుమారుడు వెంకటేశ్వర శర్మ అకాలముగ మరణించుటచేత కొంతకాలము మంచములో పడియుండి మృతిచెందెను

ఈమె సుగుణవిశేషముచే సంపూర్ణ ధర్మపత్నీత్వమును నిర్వహించిన శీలవతి ఐశ్వర్యమును, ఇహలోక సౌఖ్యమును పాటింపక అర్ధశతాబ్దమునుండి దేశసేవ, సంఘసేవ చేయుచున్న భర్తయగు (శ్రీ) వేంకటసుబ్బయ్యగారికి ఈమె అన్ని విధముల తోడ్పడినది. సంఘసేవలో బహిష్కారము, దేశ సేవలో జైలుప్రాప్తిని భర్తతో కూడ ఈమె అనుభవించెను.

భర్తయు కుమారుడును కోరినవిధమున బంధువులకు జడియక యథావిధిగా శాస్త్రోద్దిష్టముగా వితంతూద్వాహము ఆమె భర్తతోపాటు పీటలమీద కూర్చుని కుమారుడు వేంకటేశ్వర్లు (శర్మ) కు జరిగించినది. కీర్తిప్రతిష్ఠల నార్జించిన పండిత ప్రకాండులైన కుమార రత్నములు నలుగురు. వీరి సాహచర్యముచే ఈమె జీవితమును యథేచ్ఛగా జరుపుకొన్నను తుదకు విహ్వలమై తన 60 వ యేట భౌతిక శరీరమును త్యజించెను "

భారతదేశమున ఉప్పుసత్యాగ్రహము ప్రారంభమైనది. వేంకట సుబ్బయ్యగారి నాయకత్వమున తుమ్మలపెంట, గోగుల

పల్లి, మైపాడు గ్రామములయందు ఉప్పు సత్యాగ్రహము జరుపబడినది. ఘనవిజయము సాధింపబడినది. ఫలితముగ మరల వీరికి జైలుశిక్ష పడినది. వీరు ఒక్కరే కాదు. దేశ భక్తులగు వీరి కుటుంబసభ్యులు — భార్య మహాలక్ష్మమ్మగారు, పుత్రులు వేంకటేశ్వరశర్మ, రామచంద్రయ్య గార్లును శ్రీకృష్ణ జన్మస్థానము నలంకరించిరి.

వీరు 1937 లో మద్రాసు అసెంబ్లీ ఎన్నికలలో పోటీ చేసిఅత్యధిక మెజారిటీతో గెలిచిరి. మద్రాసు శాసనసభ యందు సభ్యుడుగనున్న సమయముననే టీకాల వ్యతిరేకోద్యమమును ప్రారంభించిరి టీకాలు వేయుటవలన సంభవించు విషపరిణామములను సాక్ష్యసహితముగ ప్రభుత్వదృష్టికి తెచ్చుటకు అధికముగ ప్రయత్నించిరి. రెండవ ప్రపంచ యుద్ధసమయమున కాంగ్రెస్ వారికిని ప్రభుత్వమునకును అభిప్రాయభేదములు వచ్చినవి ఈ కారణమున తన అసెంబ్లీ సభ్యత్వమునకు రాజీనామా చేసిరి

వ్యక్తి సత్యాగ్రహ సమయమున వీరు ఆ ఉద్యమమున పాల్గొని మరల కొన్ని నెలలు కారాగారమున గడిపిరి. ఈ సమయముననే ఆంధ్రరత్నమని ప్రశంసింపబడు మహా ప్రతిభాశాలి యగు వీరి తృతీయపుత్రరత్నము వేంకటేశ్వర శర్మగారు అకాలముననే అస్తమించిరి. అకలంక దేశభక్తుడు, మహోపన్యాసకుడు, సంస్కృతాంధ్రహిందీ భాషా పండితుడు, సుగుణఖని యగు పుత్రుని అకాలమరణము మాతృమూర్తి యగు మహాలక్ష్మమ్మగారిని విచలితను చేసెను. ఆ దారుణవ్యధవలన

పక్షవాతమునకు గురియై మతి చలించి 1945 లో స్వతంత్ర భానూదయమునకు పూర్వమే దివంగతులైనారు.

మేరు సమాన ధీరులగు శ్రీ వేంకట సుబ్బయ్యగారు ఈ కుటుంబపరిస్థితులకు ఎంతమాత్రము చలింపలేదు. ప్రత్యుత సంఘసేవయందు పట్టుదల అధికమైనది. 45 నుండి పల్లిపాడు గ్రామమున పినాకినీ సత్యాగ్రహ ఆశ్రమమునందును, పరిసర గ్రామప్రజలకును వైద్యసహాయము చేయుతలంపుతో ఒక ఆయుర్వేద వైద్యశాలను ప్రారంభించి 5 సంవత్సరములు నిర్వహించిరి. వీరికి ఆయుర్వేద ఔషధములను తయారుచేయుటలోను, రోగ నిదానమందును ఆ కాలముననే విశేషానుభవము కలిగినది. ప్రజలకు వైద్యవిద్యలద్వారా సేవ చేయుచు, దానినే భగవత్సేవగా భావించుచు ప్రశాంతముగ ఆ సమయమును గడిపిరి.

సంఘసేవతోపాటు సంఘసంస్కరణాభిలాషయు వీరికి బాల్యమునుండియు కలదు. ఇతరులకు చెప్పుటయే గాక తాను ఆచరణలో పెట్టి సంఘమునకు ఆదర్శప్రాయులైనారు. అస్పృశ్యతను పాటింపకుండుట, సహపంక్తి భోజనములు చేయుట ఒక వితంతుబాలికను తన పుత్రునికి వివాహము చేయుట, బంధుమిత్రులు వెలివేసినను లక్ష్యపెట్టక తాను నమ్మిన సత్యమును ప్రచారము చేయుట — ఈ విషయముననే గుంటూరు జిల్లా సంఘసంస్కర్తల సభలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారితో కూడ శ్రీ పుష్పగిరి స్వాములకు వ్యతిరేకముగ ఉపన్యసించి తీర్మానములను చేయుట — మున్నగు పరశ్శతోదాహరణములు వీరి సంఘసంస్కరణోద్యమ స్వభావమును

స్పష్టము చేయుచున్నవి. ఆంధ్రదేశమున శ్రీ కందుకూరి వీరేశలింగము గారివంటి మహనీయులు ఒకటి—రెండు రంగములయందు మహత్తరకృషి చేసిన శ్రీ వేంకట సుబ్బయగారు తమ కార్యక్షేత్రమును సువిశాలమొనర్చి అనేకరంగముల యందు (రాజకీయము, సంఘసేవ, సంఘసంస్కరణ, ఆయుర్వేదప్రచారము మొదలగునవి) గణనీయమగు కృషి చేసి ఆదర్శపురుషులైరి.

పుణ్యదంపతులగు వేంకటసుబ్బయ్య — మహాలక్ష్మమ్మ గార్లకు నలుగురు పుత్రులు, నలుగురు పుత్రికలు జన్మించిరి. జ్యేష్ఠపుత్రులు శ్రీ వేంకటసుబ్రహ్మణ్యముగారు, జననీజనకులు దేశసేవా కార్యక్రమమున నిమగ్నులైయుండ, కుటుంబభారము వహించి పరోక్షముగ దేశసేవకులయిరి, వీరి సహకారము లేకుండిన వేంకటసుబ్బయ్య గారి సదాశయములు కార్యరూపమును ధరించెడివి కావేమో.

ద్వితీయపుత్రులు శ్రీ వెంకటకృష్ణయ్య గారు పట్టభద్రులు, న్యాయశాస్త్రమందును పట్టము స్వీకరించినారు. శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారి వద్ద సంస్కృతాంధ్రములను చదివి పాండిత్యమును గడించిరి, అనేక గ్రంథములను రచించిన పండితకవి ప్రస్తుతము వీరు తిరువణ్ణామలైలో శ్రీ రమణాశ్రమాంతేవాసిగ "కృష్ణభిక్షు" అను పేరుతో కాలక్షేపము చేయుచున్నారు,

తృతీయ పుత్రరత్నము కీర్తిశేషులు శ్రీ వేంకటశ్వర శర్మగారు, వీరు బాల్యమున శ్రీ వేదం వారి వద్ద సంస్కృ

తాంధ్రములను చదివి అవిముక్త క్షేత్రమగు వారణాసి (వరణ + అసి) వెళ్ళిరి. కాశీవిశ్వేశ్వరుని దివ్యధామమున గల విద్యాపీఠమున చేరి హిందీభాషయందు అపారమగు పాండిత్యమును సంపాదించిరి. ఏకసంతగ్రాహియగు మహామేధావి యగుటవలన సంపూర్ణముగ వేదాంతశాస్త్రమును, చరిత్ర, ఆయుర్వేదమును, వ్యాకరణాలంకారశాస్త్రములను అనతి కాలముననే నేర్చి గురువులచేతను, కాశీలోగల పండితప్రకాండులచేతను ప్రశంసింపబడిరి విద్యాభ్యాసానన్తరము ఆంధ్ర దేశమునకు వచ్చినవెంటనే హిందీ – తెలుగు నిఘంటువును రచించిరి. తరువాత వీరు హిందీలో రచించిన "అధ్యాత్మ యోగ్ ఔర్ చిత్తవికలన్" అను మహాగ్రంథమును స్వర్గీయ రాజేంద్రప్రసాద్ గారి ప్రేరణచే "బిహారీ రాష్ట్రభాషా పరిషత్తు" వారు ప్రకటించిరి. ఈ మహాపండితుని అమృతలేఖిని నుండి ఎన్ని మహాగ్రంథములు వెలువడి యుండెడివో కాని అకస్మాత్తుగ వీరు సాహిత్యమును విసర్జించి భారతస్వాతంత్ర్య సముపార్జనకై జాతీయోద్యమరంగమున ప్రవేశించిరి. దేశభక్తనిలయ గృహవాతావరణమే కారణము కావచ్చును. అభ్యాస వ్యుత్పత్తి ప్రతిభావిశేషములకు తోడుగా భగవంతుడు వీరికి సకలజనాకర్షణీయమగు మధురకంఠధ్వనిని ప్రసాదించెను. వీరి మహోపన్యాసములు ఆ శేషప్రజలను సమ్మోహితులను చేసెడివి. మృదుమధుర గంభీర పదవిన్యాసముతో జాతీయోద్యమస్వభావమును అవశ్యకతను ప్రజలకు వివరించి చెప్పుచుండ, లాఠీఛార్జి జరుగునని తెలిసియు ప్రజలు తండోప

తండములుగా వచ్చెడివారు. ఆంథోనీ, గిబ్బన్ ల వంటి మహావక్తయని వీరిని ఆంగ్లవిద్యావంతులు ప్రశంసించెడివారు, వీరి అపారపాండిత్యము, అసమానవక్తృత్వము, అద్వితీయప్రతిభ ప్రతిపక్షీయులచేతను కొనియాడబడునవి. ఈ తత్త్వవేత్తయే స్త్రీకి పునర్వివాహము శాస్త్రసమ్మతమని గుర్తించి జననీ జనకుల అభిప్రాయానుసారము బాలవితంతువును వివాహమాడెను. వీరికి ఇర్వురు పుత్రులు, పుత్రికలు కలిగిరి. తరువాత జాతీయోద్యమున నిరంతర పర్యటన, నిరంతర ఉపన్యాస పరంపరలవలన అలసి అల్పప్రాయముననే (డిసెంబరు-1942) పరమపదించిరి. "సుకృతీ గతాయుః" అనుట ఇందువలననేమో!

చతుర్థపుత్రులు శ్రీ రామచంద్రయ్యగారు. మొన్న మొన్నటివరకు ఆంధ్రవిశ్వవిద్యాలయమున చరిత్ర–పురావస్తు శాఖలకు అధ్యక్షులుగానుండి పదవీ విరమణ చేసిరి. వీరికి ఆంధ్రసాహిత్యమునందును మంచి పాండిత్యము కలదు. వీరు గంగాలహరి, రమణస్మరణ, తెనుగుమీరా అను గ్రంథములను రచించిరి. వీరు ఆంగ్లమున రచించిన Studies on Vijayanagara అను గ్రంథము విజయనగరసామ్రాజ్య చరిత్రకు ఒక ప్రామాణిక గ్రంథము.

ఈ విధముగ శ్రీ ఓరుగంటి వేంకటసుబ్బయ్యగారు సదాశయములకు తగిన సత్సంతానముపొంది నిర్విచారముగా జన్మస్థలమగు కావలిలో తన 92 వ సంవత్సరమును గడుపుచున్నారు. వీరికి ఇచట స్వగృహముగాని ఆస్తిపాస్తులుగాని

లేవు. ప్రభుత్వము ఆ స్థిపాస్తులు లేని జాతీయోద్యమ కార్య కర్తలకు 'పెన్షన్' ఏర్పాటు చేయుటను ఆలోచించుటకుగాను ముహూర్తము పెట్టించుటకు దైవజ్ఞులను సంప్రదించుటకై ఆలోచించుచున్నదని వినికిడి. కొన్నితరములు గడువవలెను. అంతవరకు దైవము వీరికి ఆయుర్దాయమును ప్రసాదించుగాక.

వీరి మనుమడు, శ్రీ వేంకటేశ్వర శర్మగారి ద్వితీయ పుత్రుడు శ్రీ లక్ష్మీనారాయణ గారు జవహర్ భారతిలో చరిత్రోపన్యాసకులుగ పనిచేయుచున్నారు. శ్రీ వేంకట సుబ్బయ్యగారు తన శేషజీవితమును జన్మస్థలమగు కావలిలో గడువవలెనని సంకల్పించిరి. తదనుగుణంగా పవిత్రదంపతులు లక్ష్మీనారాయణ—లక్ష్మీదేవి గార్ల సంరక్షణమున సుఖముగా జీవయాత్ర సాగించుచున్నారు.

ఇతి శమ్,

ఆంధ్రోపన్యాసకుడు
జవహర్ భారతి
కావలి.

ఇట్లు
సుజన విధేయుడు
యనమండ్ర సుబ్రహ్మణ్య శాస్త్రి.

# ప్రధానముగ గమనింపవలసిన విషయము

చూర్ణములు 2 మాసములకు పైన శక్తిహీనము అగును ఘృతతైలములు 4 మాసములకు పైన సత్వహీనంబులగు. లేహ్యములు, మాత్రలు, ఆసవారిష్టములు ఒకసంవత్సరము పైన బలహీనములగును.

వంటఔషధములు, స్వర్ణాది ధాతు భస్మములు కాలము గడిచినకొలది శక్తివంతములగును.

పర్వతప్రాంతములయం దుండెడు ఓషధులు ఉత్తమములు, ఓషధులు శరదృతువునందు మిక్కిలి వీర్యవంతములుగా నుండును. కావున ఈఋతువునందే స్వీకరింపవలెను. విరేచన వమనాదుల కుపయోగించు ఓషధుల మాత్రము వసంత కాలమున స్వీకరింపవలెను.

# చూర్ణములు.

## 1. అశ్వగంధచూర్ణము.

పెన్నేరుగడ్డ, (అశ్వగంధి), నేలగుమ్మడిదుంప, సుగంధిపాలబెరడు, ఫిరంగిచెక్క. ఇవి సమాన భాగాలుగా చేసి మెత్తగా పొడుము చేయవలెను.

మోతాదు- పిల్లలకు ఒక చెంచా, పెద్దలకు రెండు చెంచాలు. రెండు ఔన్సుల కాచిన పాలలో అశ్వగంధి చూర్ణము వేసి, సమముగా పంచదార వేసి ఉదయము సాయంకాలము పుచ్చుకొనవలెను.

గుణము:- కృశత్వము పోవును. ఇంద్రియ పుష్టిని, బలమును కలిగించును.

## 2. సుదర్శనచూర్ణము.

పదార్థములు.— తాళిసపత్రి, శొంఠి మిరియాలు. ఏలకులు, కరక్కాయ, ఉసిరికబెరడు, తాడికాయబెరడు, లవంగపట్ట, తెల్లతెగడ. చాగవేరు, మోడి, పసుపు. మ్రానిపసుపు. కచ్చూరాలు. బలామూలం. చెంగల్వకోష్టు. వాకుడు, ములక, తుంగగడ్డ, పర్పాటకము, వేపపట్ట, పుష్కరములు, కటుభారంగి, వాము, రక్తచందనము. చవ్యము, చిత్రమూలము, తామరపూలు, గ్రంథితగరం, వట్టివేరు, వాయువిడంగాలు, వస, దురదగొండివేరు, కొడిశపాలపట్ట-గింజలు, తిప్పతీగె, దేవదారు, కురువేరు. మునగగింజలు, చేదుపొట్ల, కటుక

రోహిణి, వెదురుప్పు, రాతినార, అతిమధురం, ఇవి సమ భాగాలుగా తీసికొని చూర్ణించి అందు సగభాగము నేలవేము చూర్ణము కలిపి ఉంచవలెను. అవసరమునుబట్టి రోజునకు 4, 5 మారులు వాడవచ్చును. చూర్ణములన్నియు పిల్లలకు ఒక చెంచా, పెద్దలకు రెండు చెంచాలు మోతాదుగా గ్రహించవలెను.

గుణము:- త్రిదోషజ్వరము లేకాక చలిజ్వరములు, విషమజ్వరములు సన్నిపాతజ్వరములు, సప్తధాతుగత జీర్ణజ్వరములు పోవును. దప్పిక, తాపము, రక్తదోషములు, స్త్రీలరజోదోషములు, వాతవ్యాధులు, నులిపురుగులు. ఏలికపాములు-వీటివలన వచ్చువ్యాధులు తప్పక తగ్గును. నీటితోగాని తేనెతోగాని తీసికొనవలెను. పైత్యముగాకూడ ఉన్న మాదీఫలముతో తీసికొనవలెను.

3. ఉసీరాదిచూర్ణము.

పదార్థములు :- వట్టివేళ్ళు, మోడి - వీటిని విడివిడిగా దంచి వస్త్రకాళితం చేసి (సన్నని వస్త్రమున పొడిని పోసి క్రింద పళ్ళెము ఉంచి కదిపిన మెత్తనిది పళ్ళెములో పడును. వస్త్రములో గరుకుగా ఉండునది మిగులును. దానిని మరల దంచి వస్త్రములో ఉంచి కదిపిన మెత్తని చూర్ణము లభించును, ఈ ప్రక్రియను వస్త్రకాళితము లేక వస్త్రఘూళితము అందురు). రెండింటిని సమభాగములుగా కలుపుకొనవలెను.

అనుపానము :- హృదయమందు చురుకుచురుకుగా పోట్లు

పొడుచుచున్నట్లు ఉన్నపుడు ఆవునేతితో కలిపి ఇవ్వవలెను. అజీర్ణముగా నున్నపుడు వేడినీళ్ళతో సేవింపవలెను.

4. సర్దారు లేపన చూర్ణము.

వస్తువులు :– శొంఠి. నవాసారము, దేవదారు-

ఇవి చూర్ణించి వస్త్రకాళితంచేసి గోమూత్రముతో లేక వేడి నీళ్ళతో ఉడికించి పొత్తికడుపున పట్టువేయువలెను, అన్నివిధములైన వాపులందును, గ్రంథులందును, అపక్వ వ్రణములు, యకృత్ ప్లీహావృద్ధుల యందును పైన పట్టువేసిన బాగుగా పనిచేయును.

5. అష్టక చూర్ణము

శొంఠి, పిప్పలి, మిరియాలు, వాము, సైంధవలవణము జీలకఱ్ఱ పొంగించిన ఇంగువ, ధనియాలు—ఇవి సమభాగములుగా తెచ్చి చూర్ణించి యుంచుకొనవలెను. భోజనసమయమున 3, 4 చెంచాల చూర్ణము వెచ్చని అన్నములో వేసికొని నేతితో కలిపి మూడు ముద్దలు తినవలెను.

గుణము:– అజీర్ణము పోవును పైత్యము హరించును. వాతగుల్మము నశించును.

6. త్రివృత్తి చూర్ణము.

తెల్ల తెగడ వేళ్ళు (లావుగను గట్టిగనున్నవి) దంచి వస్త్రకాళితము చేసి గట్టిమూతగల సీసాలో పోయవలెను.
వాడువిధానము:– 2, 3 చెంచాల పొడిని వేడినీళ్లతో

ఉదయము పరగడుపున గాని రాత్రి భోజనమైన తరువాత పరుండ బోవునపుడు గాని సేవించవలెను.

గుణము:— సుఖవిరేచనకారి. మలబద్ధకమును, కడుపు ఉబ్బరమును హరించును.

7. సౌవర్చలవణచూర్ణము.

సౌవర్చలవణము, మిరియాలు, చిత్రమూలము చూర్ణించి మజ్జిగతో కలిపి రెండు పూటల భోజనమైన తరువాత పుచ్చుకొనవలెను.

గుణము:— గ్రహణి, కడుపుబ్బరము, మూలవ్యాధి అగ్ని మాంద్యము, ప్లీహోదరము హరించును.

8. చిత్రమూలాదిచూర్ణము :—

చిత్రమూలము, మారేడుకాయలోనిగుజ్జు (ఎండించి) చవ్యము శొంఠి. సమభాగములుగా చేసి చూర్ణించి మజ్జిగతో రోజునకు రెండు మూడు మారులు రెండేసి చెంచాల మందు స్వీకరింపవలెను.

గుణము:— అన్నివిధములగు గ్రహణులు తగ్గును.

గమనిక :— ఉప్పు, కారము వాడరాదు. సగ్గుజావ, గసాలు సోపు కలిపి రసముతీసిగాని వాడుచుండుట మంచిది. రక్త గ్రహణి అయిన జిలేబీ (జీరాతోకూడ) వెచ్చవెచ్చనిది రోజునకు రెండు మూడు మారులు రెండేసి చుట్టలు (చక్రాలు) తినుట ఉత్తమము.

9. రత్నకలాచూర్ణము.

నేలవేము, కటుకరోహిణి, తుంగగడ్డ, కొడిశెవిత్తులు, శొంఠి, పిప్పలి, మిరియాలు - సమభాగాలు. కొడిశెచెక్క 16 భాగాలు, చిత్రమూలము 4 తులములు చేర్చి చూర్ణించి దానికి రెండింతలు బెల్లం కలిపి పూటకు ఒక తులం చూర్ణము నీళ్ళతోగాని పాలతోగాని సేవింపవలెను.

గుణము:- పాండువు జ్వరము, అతిసారము, అరుచి, కామెల కడుపులోని బల్లలు హరించును.

10. అర్శోహరచూర్ణము.

రెండు తులాలు తోకమిరియాలు, రెండు ఏలక్కాయలు చూర్ణించి ¼ తులం రెండు పూటల చన్నీటితో సేవింపవలెను

గుణము- మూలవ్యాధి నశించును.

ఇంకొకపద్ధతి-

కందదుంప ముక్కలుచేసి బాగుగ ఎండబెట్టి చూర్ణముచేసి రెండు పూటల రెండేసి చెంచాల పొడుము పంచదారతో కలిపిగాని ఉత్తదిగాని మూడు నెలలు తినిన నాలుగు రకముల మూలవ్యాధులు తప్పక నశించును. నులిపురుగు బాధ వున్న యెడల ఉదయము సాయంకాలము మూడేసి తులసిదళము లను ఒకవారము తినిన నులిపురుగు తప్పక నశించును.

11. తాళీసాదిచూర్ణము.

తాళిసపత్రి, మిరియాలు, శొంఠి, పిప్పళ్ళు, వెదురుప్పు (సమ

భాగాలు) లవంగపట్ట (10వ వంతు) ఏలకులు (10వ వంతు) చక్కెర పై మొత్తమునకు 5 రెట్లు అధికముగా కలిపి చూర్ణించవలెను.

మోతాదు- 1 లేక 2 చెంచాలు దినమునకు 3, 4 మారులు.

గుణము- ఆయాసము, దగ్గు, అరుచి, సామాన్యజ్వరము, జలుబు తగ్గును. పొడిదగ్గుకంటె శ్లేష్మముతో కూడిన దగ్గుపై బాగుగా పనిచేయును. పెద్దమందులకు అనుపానముగ వాడ తగినది.

**12.** అవిపత్తికచూర్ణము.

త్రికటుకములు, పిప్పలి, మిరియాలు, తుంగముస్తలు, వాయు విడంగాలు, ఏలకులు తాళిసపత్రి, లవంగాలు-ఒక్కొక్క తులము, తెల్లతెగడ (త్రివృత్తి) 40 తులాలు చూర్ణించి 60 తులాలు పంచదార కలపవలెను.

గుణము- సుఖవిరేచనకారి, మలబద్ధకము పోవును. మోతాదు దేహతత్వమునుబట్టి 1 నుండి 3 తులాలవరకు గ్రహింప వలసియుండును. వేడినీళ్ళతో తీసికొనుట మంచిది. సునాముఖిఆకు చారుగాకాచి 4 ఔన్సులు త్రాగినను 1,2 విరేచనములగును. ఇది సులభముకూడ. కాని అవిపత్తికచూర్ణము ప్రతిదినము వాడినను విపత్తు కలుగదని పెద్దలమాట.

**13.** అతిమధురచూర్ణము-

త్రిఫలములు, కరక, తాడి, ఉశిరిక, అతిమధురము. పిప్పళ్లు, వెదురుప్పు-సమభాగాలు-చూర్ణించి వస్త్రకాళితము చేయ

వలెను. మోతాదు-రెండు చెంచాలు. తేనె, నేయి పంచదార-వీనిలో దేనితోనైనను రెండు పూటల సేవింపవలెను.
గుణము- బలవర్ధకము ఇది సిద్ధ రసాయనమేగాని అశ్వగంధ చూర్ణము దీనికన్నను శ్రేష్ఠము.

14. ఏలాది చూర్ణము.

1. ఏలకులు 2 లవంగపట్ట 3. ఆకుపత్రి 4. నాగకేశరాలు 5. మిరియాలు 6. పిప్పలి 7 శొంఠి-ఇవి సమభాగాలు. ఈ మొత్తమునకు 4 రెట్లు పంచదార. 6. 7లు కొలదిగ వేయించియు, మిగిలిన వానిని ఎండబెట్టియు చూర్ణింపవలెను.
గుణములు- దీపనము, పాచనము, స్రోతశ్శోధనము, శ్వాస కాస, రక్తపిత్త, గళరోగములు హరించును,

15. వైశ్వానర చూర్ణము.

సైంధవలవణము, కురాసానివాము, వాము, చినపిప్పలి, శొంఠి కరక్కాయ (బెరడు) సమభాగాలు. వీటిని పొడిచేసి ఒక చెంచా మందు మజ్జిగలో కలిపి అజీర్ణము చేసినపుడు తీసికొనుచుండిన మంచిది.

16. వెలిగారపు చూర్ణము.

మూడు ఫలముల వెలిగారము పొంగించి చూర్ణము చేయవలెను. దీనిని తేనతో కలిపి పైన పూసిన నోటిపూత తగ్గును. రోజునకు 3, 4 మారులు పూయవలెను. నోటిపూతకు ఇతరములు- మాదికాయ గంధముగా అరుగతీసి పూచిన

చోట వ్రాయుచున్న నోటిపూత తగ్గును. గసాలు, ఎండు కొబ్బరి, సోపు నమలి తినుచున్నను తగ్గును దానిమ్మ చిగుళ్ళు, కొబ్బరి పుచ్చియు నములుచుండిన నోటిపూత తగ్గును. వగరు పదార్థములయందు నోటిపూత తగ్గించు శక్తి కలదు.

17. సీతోపలాదిచూర్ణము.

లవంగపట్ట 1 తులము, ఏలకులు 2 తులములు, పిప్పళ్ళు 4 తులములు, వెదురుప్ప 8 తు॥ ఖండశక్కర 16 తు॥ చూర్ణించి పాలు, నేయి, తేనె వీనిలో దేనితోనైనను 1, 2 చెంచాలు రోజునకు 4, 5 మారులు పుచ్చుకొనవలెను.

గుణము- శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, అరుచి, శరీర తాపము, సామాన్యజ్వరము, జలుబు తగ్గును. నాలుక మొద్దుబారుట మానును.

18 వెఱ్ఱిపుచ్చ చూర్ణము

వెఱ్ఱిపుచ్చకాయలను ఎండబెట్టి చూర్ణించి నస్యముగ పీల్చిన ఎట్టి తుమ్ముల వ్యాధియైనను తగ్గును జలుబు తగ్గును.

10. చేదుపొట్ల చూర్ణము-

చేదుపొట్ల, ఆముదపువేరు, మునగవేరు, శొంఠి, తంగేడువేరు వీటిని పుల్లనీళ్ళతో నూరి శిరస్సున మర్దన చేసిన సకల శిరో రోగములు హరించును.

20 దశమూల క్వాథచూర్ణము

దశమూలములు- ముయ్యాకు పొన్న, కొలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, మారేడు, నెల్లి, పెద్దమాను, పెగ్గుమ్మడి

కలిగొట్టు-ఇవి సమభాగములు. వీని వ్రేళ్ళను దంచి 16 రెట్లు నీళ్ళను చేర్చి సగము మిగులునట్లు కాచి వడకట్టి తత్సానుసారముగ పిప్పలి చూర్ణము చేర్చి రోజుకు రెండు మూడు మారులు $\frac{1}{2}$ ఔన్సు మందు వాడవచ్చును.

గుణము- వాతకఫ జ్వరములు, సూతికా దోషములు, జలుబు అతి చెమట, శ్వాస కాసలు, నొప్పులు పోవును.

21. త్రిఫలాది చూర్ణము.

కరక, తాడి, ఉసిరిక-వీని బెరడులు చూర్ణించి తేనె, నేయి కలిపి (రజిత భస్మమునుగాని స్వర్ణ భస్మమునుగాని చేర్చుట ఉత్తమము) సేవించవలెను.

గుణము- సర్వదృష్టిరోగములు పోవును. మలబద్ధకము పోవును.

22. కాసమర్దనచూర్ణము.

యవక్షారము 1 భాగము, మిరియాలు 2 భాగములు దానిమ్మ (దాడిమ) కాయ బెరడు 4 భాగములు మెత్తగ చూర్ణించి చూర్ణానికి రెండింతలు బెల్లము చేర్చి కుంకుడుకాయంత మాత్ర బుగ్గను ఉంచుకొనవలెను. ఇతర చికిత్సలకు తగ్గని దగ్గులు ఈ మందుతో శమించును. ఎందరికో వాడితిని.

23. కర్పూర శిలాజిత్తు భస్మము.

కలబంద కాడలపై చర్మము తీసివేసి మూకుడులో పరచి దానిపై శిలాజిత్తుగడ్డను ఉంచి పైన మరల కలబంద కండలను

వేసి చీలమన్నుతో కప్పి పిడకలతో పుటం పెట్టవలెను. శిలాజిత్తురాయి భస్మమగును. ఒక చెంచా పొడును, ఒక చెంచా చక్కెర కొలదిగ వెన్న లేక పాలమీగడతో కలిపి సేవించవలెను.

గుణము- అత్యుష్ణమును తగ్గించును. మూత్రబంధనము పోగొట్టును.

---

## తైలములు

### 1. అమృతామలక తైలము.

తిప్పతీగె (64 తులాలు) ఉసిరికపండ్లు (64 తు॥) నూగుదోస (64 తు॥) గుంటకలగరాకు (64 తు॥) పాలు (256 తు॥) నువ్వులనూనె (64 తు॥)- ఇవి ఒకటిగ చేర్చి అందు అతి మధురం, యాలకులు, లవంగాలు, ఆకుపత్రి, చెంగల్వకోష్టు, మాచికాయ, ద్రాక్ష, రక్తచందనము, తెల్లచందనము. జాజి మొగ్గలు, వట్టివేరు, కురువేరు, తాడికాయలలోనిగింజలు ప్రత్యేకం-ఒక్కొక్క తులము వంతున గ్రహించి చూర్ణించి కల్కము చేసి తైలపక్వముగా దించవలెను.

గుణము- శిరోభ్రమణము, శిరఃకంపము, నేత్రశూల తగ్గును. పార్శ్వపునొప్పి తగ్గును.

## 2. భృంగామలక తైలము

గుంటకలగరాకు నిజరసము 64 తులములు, ఉసిరికపండ్ల రసము 64 తు॥ నువ్వులనూనె 64 తు॥ ఆవుపాలు 256 తులములు = 3½ కొత్త శేర్లు, అతిమధుర కల్కము 16 తు॥- అన్నీ కలిపి మందాగ్నితో వండవలెను తైలపక్వమైన తరువాత దించి పైన ఉండు తైలమును మరియొక పాత్రలో పోసికొని కల్కమును మరికొంతసేపు కాచి వచ్చినంత తైలమును తీసికొనవలెను.

గుణములు- వెంట్రుకలు ఊడిపోయిన చోట మరల మొలచును నేత్ర రోగములకు ఈ తైలమును అరికాలుకు రాసి మర్దన చేయవలెను నిత్యము రాసిన జ్ఞాపకశక్తి కలుగును. అభ్యంగనమునకు ఉపయోగించుచుండిన కేశములకు నల్లతనము శరీరమునకు కాంతి కలుగును.

## 3. దూర్వాది తైలము

అతిమధురకల్కము 40 తు॥ కొబ్బరినూనె 64 తు॥ గరిక స్వరసం 256 తు॥-ఇవి తైలపాకముగా కాచవలెను. దీనిని పైకిపూసి కొంతసేపు నాననిచ్చి సున్నిపిండితో రుద్దుకొనవలెను

గుణము- దురద, చిడుము నశించును.

## 4. భృంగరాజ తైలము.

గుంటకలగరాకు రసము 1 శేరు నువ్వులనూనె 1 శే॥ ఇనుపచిట్టెము, త్రిఫలములు, సుగంధి వేళ్లు-ఈ మూడును నూనెలో

నాల్గవ వంతు కల్కముగానూరి పై రసముతోకూడ తైలము లో వేసి కలియబెట్టుచు తైలపాకముగా దించి వడకట్టవలెను

గుణము- చుండ్రు. కేశములు నెరయుట, పేనుకొరుకుట పోవును,

5. మూర్ఛితతైలము.

వస్తువులు- నువ్వులనూనె 16 శరావములు (1 శరావము = 32 తులాలు) కల్కమునకు మంజిష్ఠ 1 శరావము, పసుపు లొద్దుగ, ముస్త, సన్నరాష్ట్రము ఉసిరికచూర్ణము, తాడి కాయ, కరక్కాయల చూర్ణములు, వట్టివేరు, మొగలి ఊడ లు- ఇందు ఒక్కొక్కటి 16 తులముల చొప్పున సేకరించ వలెను.

నువ్వులనూనె పెద్దపాత్రలో పోసి కాచుచు తైలముపై నురుగు స్వచ్ఛముగ వచ్చినపుడు దించి అందు పై చెప్పిన వస్తువుల కల్కమును వేసి కలియపెట్టుచుండవలెను. పాత్ర పెద్దదిగానుండుట మంచిది. తరువాత నూనెకు సమముగా నీళ్లు చేర్చి ఏడు దినములు ఉంచి, తైలగంధము లేక ఎర్రగా పలుచగా పైకి తేరిన తైలమును తీసికొనవలెను.

గుణము— పీనసాదిదోషములు హరించును.

6. చందనాదితైలము.

మూర్ఛితతైలము 16 ఔన్సులు. చందన తైలము 16 ఔన్సు లు, కదంబ అత్తరు 1 డ్రాము.— ఈమూడు కలిపి ఒకరోజు ఉంచిన మంచి సువాసన వచ్చును,

గుణము:—ఇది కేశములను వృద్ధిపరచును. మెదడునకు చల్ల దనము ఇచ్చును. శిరోవేదనయందును, పీనసాది వ్యాధుల యందును 5, 6 చుక్కలు ముక్కులో పోసిన సుగుణము కలుగును.

7. బ్రాహ్మీతైలము—

సరస్వతీ ఆకు (బ్రాహ్మీ) తీగ, తోడిమలరసము 1 శేరు, నూనె 1 శేరు, కలిపి తైలపాకముగా కాచి అందు కర్పూరం, అగరు, ఆకుపత్రి, మంచిగంధము, కచ్చూరాలు. బావంచాలు, చామంతి, రోజా మొగ్గలు, వగడ మొగ్గలు, వట్టివేరు, కురువేరు, జటామాంసి—ఇవి ఒక్కొక్కటి $\frac{1}{2}$ తులము. వేసి కొంచెము సమయము కాచి దింపి వడకట్టవలెను. సరస్వతి ఆకు ఎండుదైనను ఉపయోగింపవచ్చును,

గుణము:— ఈ తైలమును బాగుగ మర్దన చేసిన, ఉన్మాదము జ్ఞాపకశక్తి లేకపోవుట, మతిభ్రంశము పోవును. సారస్వత లేహ్యమును, సారస్వతారిష్టమును కూడ సేవించుచుండిన చాల మంచిది మాటలురాని పిల్లలకు మాటలువచ్చును, బుద్ధిపాటవము పెరుగును. మెదడులోని సూక్ష్మనరములకు బాగుగ శక్తినిచ్చును.

8. శాంతితైలము:—

పాలాకు, నేలఉసిరిక, పొన్నగంటి, గుంటకలగర-వీటి రసములు ఒక్కొక్క శేరు, ఒక శేరు నూనె (నువ్వులదే) కలిపి తైలపాకముగా కాచవలెను. తరువాత దానిలో కర్పూరము

1 పలము, పచ్చాకు 1 పలము, అగరుచెక్క 2 పలాలు ఆకుపత్రి, జటామాంసి, పగడమొగ్గ, రోజామొగ్గ, చామంతి, దవనము, వట్టివేరు, బావంచాలు, కచూరాలు- ఇవన్నియు చేరి ఒక ఫలము - అన్నీ పొడిచేసి వేసి కాచి దించి వడకట్టి ఉపయోగించుకొనవలెను

గుణము:- పిచ్చిఆలోచనలు రావు. మనస్సు నిర్మలముగ ఉండును. కేశసమృద్ధి కలుగును. చుండ్రు, పేనుకొరుకుడు తగ్గును.

9. అపామార్గ తైలము.

ఉత్తరేణి మొక్కను సమూలముగ ఎండించి కాల్చి బూడిద చేసి, దానికి నాలుగురెట్లు నీళ్ళుపోసి బాగాకలిపి రాత్రి ఉంచి ఉదయము అందలి తేటనీటిని తీసికొని, అందు ఉత్తరేణి క్షారమును కల్కము కావించి కలిపి నీటిలో సగము నూనె వేసి సగమగునట్లు కాచి యుంచుకొనవలెను.

గుణము:- 4, 5 చుక్కలు చెవిలో రెండుపూటల వేసిన చెముడు, హోరు తగ్గును.

10. జంబూతైలము:-

మామిడి నేరేడు విప్పచిగుళ్ళు - వీటిని నూరి నాలుగు రెట్లు నూనె పోసి కాచవలెను.

గుణము:- చెవినుండి చీముకారుట తగ్గును, కొంతకాలము వాడిన చెముడు, కర్ణనాదము పోవును.

**11.** పంచకషాయ తైలము:-

నల్లతుముక్కి, కరకాయ, లొద్దుగ, చిరువేరు, ఉసిరిక- ఇవి సమభాగములుగ తీసికొని చూర్ణించి అందు వెలగపండ్లరసము, తేనె కలిపి చెవిలో వేసిన కర్ణస్రావము నశించును.

**12.** అర్క తైలము :-

పసుపు కల్కము చేసి నాలుగురెట్లు తెల్లఆవనూనె, నూనెకు 4 రెట్లు జిల్లేడుఆకుల రసము పోసి తైలపక్వముగ కాచి వడ కట్టి శరీరమునకు పూసుకొనిన - గజ్జి, చిడుము, కురుపులు, దురద పోవును.

**13.** గంధక తైలము:-

గంధకము 8 తులములు మెత్తగ నూరి 32 తు॥ నూనెను కొద్దికొద్దిగా చేర్చి నూరవలెను. అందు త్రిఫలచూర్ణము, నేలవేముచూర్ణము చేర్చవలెను. ఇది సకల చర్మవ్యాధులను రూపుమాపును,

**14.** కర్పూరాది తైలము:-

ముద్దకర్పూరము, ఆవాలు. తులసిఆకు, శొంఠి, మిరియాలు· వెల్లుల్లి, ఎండుమిరపకాయలు, మునగచెక్క-ఇవి సమభాగాలు· వీటికి నాలుగురెట్లు నూనె, తైలమునకు సమముగా నీరు చేర్చి తైలపాకముగా కాచవలెను.

గుణము:- వాతనొప్పులు, నరములు లాగుట, చలువలు క్రమ్ముట, వాపులు, బెణుకులు మొదలైనవి తగ్గును.

**15. బలాతైలము (క్షీరబల)**

ముత్తవపులగ కషాయమున, ముత్తవపులగపు కల్కమును, దానికి సమానమగు నూనెను, దానికి సమానముగ పాలను కలిపి కాచవలెను, ఇట్లు వేయిసార్లు కాచిన "సహస్రవర్తితము" అందురు. దీని శక్తి అపారము. పై విధముగా వందమార్లు కాచినదానిని "శతావర్తితము" అందురు. ఇదియు అద్భుతముగ పనిచేయును. కాని శ్రమ అధికము.

గుణము:- సకల వాత వ్యాధులను శమించును. రక్త దోషములు, వాతరక్తము వాపును ఇంద్రియ పాటవము, కాంతి, బలము కలిగించు రసాయనము,

**16. మాషతైలము**

నాలుగు శేర్ల మినుములను ఒకకుండలో పోసి, దానికి 8 శేర్లు నీరుపోసి, ఒకవంతు నీరు మిగులునట్లు కాచి అందు-పాలకూర పిన్నసదాప, త్రికటుకములు, దూపరాష్ట్రము, యష్టిమధుకము, సైంధవలవణము, దూలగొండి విత్తులు - వీని చూర్ణము. దినుసునకు $\frac{1}{4}$ శేరు, నూనె నాలుగు శేర్లు, పాలు ఆరు శేర్లు కలిపి చిక్కగా కాచవలెను.

గుణము:- రక్తవాతము, కంపవాతము(కాళ్లుగాని చేతులుగాని వ్రేళ్లుగాని అదురుట) కీళ్ళనొప్పులు (ఆమవాతము)తగ్గును.

**17. పిండతైలము:-**

మైనము, మంజిష్ఠ, తెల్లగుగ్గిలము, సుగంధిపాల - ఇవి సమ భాగములు, రెట్టింపునూనెలో వేసి కాచవలెను.

గుణము:- కాళ్ళపగుళ్ళు శోభి, వాపులు, నొప్పులు నశించును.

1. అశ్వగంధి లేహ్యము.-

అశ్వగంధి చూర్ణమునకు (చూర్ణములు- అనుప్రకరణమున కలదు) సమమగు చక్కెరతో 12½ శేరు పాలను (ఆవుపాలు శ్రేష్ఠము) కలిపి పాకంగా తయారు అయిన తరువాత అయిదుఫలముల ఆవునేయి చేర్చి చల్లారిన తరువాత 5 ఫలముల తేనె కలుపవలెను.

ఇంకొక విధానము-అశ్వగంధి చూర్ణము 2 వీశెలు, నేయి 1 వీశ, పంచదార 4 వీశెలు, ఎండు ద్రాక్షపండ్లు 40 తులములు, ఏలకులు 8 తులాలు, తేనె 2 వీశెలు. ముందు పంచదార తేనె పాకంగా చేసి చల్లారిన తరువాత పై పదార్థములు చేర్చి బాగుగా కలుపవలెను.

గుణము-ఇంద్రియపుష్టి, బలము, ఉత్సాహము కలుగును: నికార్శ్య ప్రధానముగ తగ్గును నరములకు శక్తి కలిగించును. మలబద్ధకము పోవును. పాలతో రెండుపూటలు సేవించవలెను. మోతాదు ½ తులం, పత్యము లేదు ఈ లేహ్యమున రోగానుగుణముగ భస్మములను, వంట ఔషధములను కలుపుకొని సేవించిన, గుణము అత్యధికము.

2 చ్యవనప్రాస -

మారేడు వేళ్ళు ద్రాక్ష, రక్తచందనం! జీవంతి (గుడూచి) కలువదుంపలు, పెదమాను, నేలగుమ్మడి, పెగ్గుమ్మను, పుష్కరమూలం, కలిగొట్టు, అగరు, కాకోలి=శతావరి, అడ్డసరపు వేళ్ళు, చిట్టాముట్టి (బలా) కరక్కాయ

కాకిదొండ, శాలిపర్ణి, పృశ్నిపర్ణి, మాషపర్ణి, ముద్గపర్ణి పిప్పలి, పర్లేరువారుడు, పెదములక, కర్కాటకశృంగి, నేల ఉసిరిక, బుద్ధిలేకవిదారి. కచూరాలు, తుంగముస్తె, పునర్నవ, అశ్వగంధి చూర్ణము, ఏలకులు—ఒక్కొక్కటి ఒక్కొక్క ఫలము.

వీటిని మెత్తగా దంచి ఒకద్రోణము (256 తులాలు) నీటిలో పోసి. 500 ఉసిరికపండ్లు ఆనీటిలో మునుగునట్లు వేసి పాలవవంతు మిగులునట్లు కషాయము కాచి వడపోసి, తరువాత ఉసిరికపండ్లు వలిచి, గింజలు తీసివేసి అందులో పెచ్చుపోవునట్లు నన్నని జల్లెడపై వైచి రాయవలెను. పీచు పోగా మిగిలిన పిష్టమును నేయి 6 ఫలములు, నూనె 6 ఫలములు ఉంచిన పాత్రనుపొయ్యిమీద పెట్టి వేయించవలెను.

తరువాత వడగట్టి ఉంచిన-కషాయమునందు కలకండ 5 ఫలములు వైచి కరిగిన తరువాత వడపోసి లేహ్యపాకముగా తీసి అందులో వేయించిన ఉసిరికపిష్టమును, వంశలోచన 4 ఫలాలు-పిప్పలి 2 ఫలాలు—దాల్చినచెక్క ఏలకులు ఆకుపత్రి నాగకేసరాలు—ఒక్కొక్కటి రెండుతులములను మెత్తగ దంచి ఆచూర్ణమును బాగుగ కలియబెట్టి చల్లారిన పిదప 6 ఫలముల తేనను వేసి సీసాలలో పోయవలెను.

లేహ్యముల మోతాదు సుమారు అరతులము చక్కెర కలిపిన పాలతో సేవించుట మంచిది.

గుణము—బాలురకు వృద్ధులకు బలవర్ధకము, శ్వాసకోశముపై ప్రధానముగ పనిచేయును. శరీరమున ప్రధానములగు హృదయ-శ్వాసకోశ-మెదడులకు శక్తిని కలిగించును. ఎము

గని పిల్లలు ఒక సంవత్సరము వాడిన ఎదుగుదురు. వైద్య శాస్త్రమున దీని ప్రభావము అపారముగ చెప్పబడినది. ఇందు ప్రవాళభస్మ మౌక్తికాది భస్మములను కలిపి సేవించిన ప్రాథమికస్థితిలోనున్న క్షయ పోవును సిద్ధమకరధ్వజాదులను కలిపి సేవించిన అపారమగు బలము కలుగును. అర్జునారిష్టతో సేవించిన సకల హృద్రోగములు పోవును.

3, త్రివృత్తి లేహ్యము.—

తెల్ల తెగడచూర్ణము, కరక్కాయచూర్ణము, శొంఠి, ద్రాక్ష—ఒక్కొక్కటి 6 పౌనులు, రేలగుజ్జు 1 పౌను, కలకండ 50 పౌనులు, తేనె 25 పౌనుల, నేయి 12 పౌనులు, ఏలకులు 5 తులాలు, పచ్చకర్పూరము 1½ తులము.

మొదట రేలగుజ్జు నీటిలో కలిపి శుభ్రముచేసి వడపోయగా వచ్చిన సారమును ఒకపాత్రలో పోసి కాచి ఇగరపెట్టవలెను. చివరకు అది తేనెవలె తయారగును, ఇది ఒక పౌను తయారుచేయవలెను. కలకండలో నాలుగవ వంతు నీరుచేర్చి కాచవలెను. లేహ్యపాకము వచ్చిన తరువాత త్రివృత్తి, శొంఠి—మొదలగువాని చూర్ణము వేసి బాగా కలియబెట్టి, అందు నేయివేసి దించి, గింజలు తీసిన ద్రాక్షపండ్లు, ఏలకచూర్ణము, పచ్చకర్పూరము, రేలగుజ్జును కలుపుకొనవలెను.

గుణము—సుఖవిరేచనకారి, మొలలవ్యాధియు తగ్గును. గర్భవతులు, బాలురుకూడ వాడవచ్చును,

4. ధాన్యకాది లేహ్యము.—

ధనియాలు, సునాముఖి ఆకు, తెల్లతెగడ, ద్రాక్ష—

ఒక్కొక్క భాగము, రోజాపువ్వు రసము అర్ధభాగము, కేల గుజ్జు నాలవభాగము, నీరుగొబ్బి విత్తులు ¼-వ భాగము, కల కండ రెండుభాగములు, తేనె మూడుభాగములు, నేయి 1½ భాగము.

ముందుగా పై ద్రవ్యములను చూర్ణించి వస్త్రకాళితం చేసి కలకండ లేహ్యపాకంగా కాచి చూర్ణములు వేసి బా గుగ కలిపి, తేనె, నేయి చేర్చవలెను.

గుణము—సుఖవిరేచనకారి. పైత్యమును తగ్గించును, ఆకలి కలుగును. సుకుమారులు తీసికొనతగినది.

5. బిల్వాది లేహ్యము —

32 ఫలముల మారేడు వేళ్ళను దంచి నాలుగురెట్లు అధికముగ నీరుపోసి నాల్గవవంతు నీరు మిగులునట్లుగ కాచి అందు 30 ఫలముల బెల్లము కలిపి, చిక్కగా కాచిన పిదప 3 ఫలముల శొంఠిపొడి, 4 ఫలముల మిరియాలపొడి, 2 ఫల ముల పిప్పలిపొడి, 1 ఫలం చవ్యపుపొడి, 1 ఫలం తాళిస పత్రి పొడి, 1 ఫలము నాగకేసరము పొడి, 2 ఫలములు మోడిచూర్ణము, చిత్రమూలము, ఏలకులు, లవంగచెక్క, ఆకుపత్రి-ఇవి ఒక్కొక్క-ఫలం పొడిచేసి, 2 ఫలముల జీలకర్ర పొడివేసి బాగుగా కలియపెట్టి, కొంచెము వేడిగానున్నపుడు లేహ్యపాకమునకు తగినంతగా తేనెపోసి బాగుగా కలిపి దించవలెను.

గుణము—సర్వచర్ధులు (వాంతి, ప్రమేహరోగము, కామిల, గ్రహణి, అరుచి, పీనసము, కడుపుబ్బరము, శ్వాసకాసలు, క్రిమిరోగములు, పాండువు హరించును.

6. లఘుబిల్వాది లేహ్యము:-

32 ఫలముల మారేడు వేళ్ళను దంచి నాలుగురెట్లు నీటినిపోసి నాల్గవవంతు మిగులునట్లుగా కాచి అందు పాతబెల్లము 16 ఫలములు కలిపి లేహ్యపాకముగా కాచి అందు తుంగముస్తలు, జీలకఱ్ఱ, ధనియాలు, ఏలకులు, నాగకేసరాలు, శొంఠి, పిప్పలి, మిరియము వీటి చూర్ణములు ఒక్కొక్క పలమువంతున వేసి బాగుగా కలియబెట్టి అందు కొంత తేనెనుకూడా పోయవలెను. గుణము:- పైత్యము, ఎల్లప్పుడు నోట నీరూరుట, అరుచి, అగ్నిమాంద్యము పోవును.

7. బ్రాహ్మీ (సరస్వతి) లేహ్యము:-

సరస్వతి ఆకురసం ఒకపౌను చక్కెరతో (1½ పౌను) కలిపి తేనెపాకంగా కాచి అందు ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, పిప్పలి, జీలకఱ్ఱ, ఒక్కొక్క తులము చూర్ణించి కలుపవలెను, కొలదిగ తేనెను వేయవచ్చును.

గుణము:- జ్ఞాపకశక్తి కలిగించును. మెదడునకు శక్తిని కలిగించును.

8. సౌభాగ్యశొంఠి:-

వస్తువులు:- శొంఠి 1½ పౌను, ధనియాలు 24 తులములు వాయువిడంగములు 8 తులములు, జీలకఱ్ఱ 16 తులాలు త్రికటుకములు ఒక్కొక్కటి 8 తులములు, ముస్తలు, ఆకుపత్రి, నాగకేసరము, ఏలకులు, ఒక్కొక్క 8 తులములు, కలకండ 7 పౌనులు, నేయి 4 పౌనులు, పాలు 6 పౌనులు.

ముందు పై ద్రవ్యములను వస్త్రకాళితము చేయవలెను. పాలలో సగము నీళ్ళుచేర్చి అందు కలకండ వేసి లేహ్యపాక ముగ తీసుకొని పై చూర్ణములను కలుపుకొని ఆ పయిన నేయిని కలుపవలెను.

గుణము:— ఆమవాతము, వంధ్యత్వము పోగొట్టును. శరీర కాంతి, ధాతువృద్ధి కలుగజేయును. ఉజీర్ణమును పోగొట్టును.

6. కూష్మాండావలేహ్యము:—

బూడిదగుమ్మడికాయపై బెరడును, లోపలిగింజలను తీసివేసి ఆకండను తురిమి, దానిని 100 పలములను గ్రహించి, నీటిఆవిరిపై వుడికించి, పిండి, పిమ్మట దానిని 16 పలముల నేతిలో కళాయిపూసిన రాగిపాత్రయందు తేనెరంగు వచ్చువరకు వేయించి వుంచుకోవలెను.

పిమ్మట 100 పలముల కలకండను పూర్వము పిండి వుంచిన గుమ్మడికాయ నీటిలో వేసి పక్వముచేయుచూ, పాకమువచ్చుటకుముందుగా వేయించి ఉంచిన గుమ్మడికాయ తురుమును వేసి కొంతసేపు మందాగ్నిచే పాకము చేయవల యును. పిదప పిప్పళ్ళు, శొంఠి, జీలకఱ్ఱ రెండేసి పలములను, లవంగపట్ట, ఏలకులు, ఆకుపత్రి, మిరియాలు, ధనియాలు ఒక్కొక్క ½ పలము మెత్తగా పొడిచేసి పైపాకమునవేసి కలియబెట్టుచూ లేహ్యపాకముగావండి చల్లారినపిదప 8 పల ముల తేనె కలుపవలెను. కొందరు వైద్యులు, పలం చక్కెర పలం ద్రాక్ష, పలం లవంగాలు, 1 కర్షం పచ్చకర్పూరం వీనిని కూడ పై మందులో కలుపుచున్నారు.

గుణము:— అగ్ని బలానుసారముగ సేవించిన రక్తపిత్తము

 

ఉరఃక్షతము, వలన కలిగిన క్షయ, కాసశ్వాసలు, చీకట్లుక్రమ్మి నట్లుండుట, వాంతి, దప్పి, జ్వరం నశించును. మరియు వీర్య వృద్ధికరము, బలకరము, శరీరమునకు నూత్నశక్తి, బలము, వర్ణము కలిగించును.

ఊపిరితిత్తులు మొదలగువానియందు భగ్నమైన భాగ ములను అతుకుకొనునట్లు చేయును. పుష్టికరము, కంఠమునకు స్వరము కలిగించును

ఇది అశ్వనీదేవతలవలన నిర్మింపబడిన కూష్మాండ రసా యనము.

10. హారీతకీ లేహ్యము:-

రెండు ఆఢకముల యవకషాయమున కరక్కాయలు 20 వేసి ఉడికించి పిసికి గింజలు తీసివేసి అందు పటికబెల్లం ఆరు పల ములు వేసి అరతులం రసాంజనమును వేసి, రెండుపలముల పిప్పళ్ళపొడిని వేసి లేహ్యపాకముగ తయారు చేయవలెను.

గుణము:- శ్వాసకాసలు హరించును.

11. ఆమ్లక లేహ్యము:-

వెయ్యి ఉసిరికపండ్లు, వెయ్యి పిప్పళ్ళు మునుగునట్లు లేత మోదుగపట్ట క్షారోదకమును పోసి, ఆ క్షారోదకము ఇగిరిన తరువాత నీడను ఎండపెట్టి ఉసిరికగింజలను తీసివేసి చూర్ణించి పిదప నాలుగురెట్లు తేనెను, నేయిని కలిపి ఆ చూర్ణమునకు నాల్గవవంతు పంచదార కలిపి నేతితో మాగిన కుండయందుపోసి ఆరు మాసములు భూమిలో నుంచి తీయవలెను. తరువాత దీనిని సీసాలలో ఉంచుకొని రెండుపూటల అరతులం చొప్పున సేవించవలెను.

గుణము:- యౌవనము, సూరేంద్ర ఆయుర్దాయము, జ్ఞాపక శక్తి, మంచి కంఠస్వరము, సంతానము కలుగును.

గమనిక:— లేహ్యాములలో తగు భస్మములను తగు పరిణామములో చేర్చి సేవించిన అధిక ఫలప్రదము. వంటౌషధములను కలిపి సేవించవచ్చును, కాని అట్టి సమయమున వైద్యుని సంప్రతించుట మంచిది.

**12.** ఖండార్ద్రిక లేహ్యము:-

పొట్టుతీసిన అల్లపుముక్కలు 16 పలములు నేతితో ఎర్రగా వేయించి అందు 12 తులముల మిరియపుపొడి, 8 తులాల పిప్పళ్ళచూర్ణము, 4 తు॥ మోడిచూర్ణం, వెదురుబియ్యం లేక వెదురుప్పు, జాజికాయ, ఏలకగింజలు, శొంఠి - వీటి పొడి ఒక్కొక్కటి 4 తులాలు, చిత్రమూలపు చూర్ణము 11 తు॥ పంచదార 16 పలములు కలిపి లేహ్యపాకముగా వండవలెను.

గుణము:- వాంతి, పైత్యము, అగ్నిమాంద్యము పోవును. పైత్యమువలన కలుగు సామాన్యవ్యాధులను పోగొట్టి మంచి ఆకలి కలిగించును. ప్రతిగృహమున ఉండతగిన లేహ్యము.

**13.** పంచవేముల ఫిరంగి లేహ్యము:-

వేపచెక్క, పెనువేప, నేలవేము, కరివేపచెక్కలు, తురకవేప చెక్క, నేలగురుగుడు (నేలఉసిరుగుడు) పల్లికవేరు, తిప్పతీగ, ముషిణిచెక్క, గొలుగువేరు, కసిందవేరు, నేలతాడి, పిల్లితేగలు, పెన్నేరు: కన్యకోమలి, నల్లజీడివేరు, నేలములగవేరు, కూతురుబుడమ సమూలం, భూశర్కర, సుగంధి, కాకిదొండగింజలు, పెద్దపల్లేరు, పెద్దమాలగొండి గింజలు, చేదు

పొట్లి, అనాసపుష్పం, తెల్ల తెగడ, దాల్చినచెక్క, యాలకులు లవంగాలు, జాజికాయ, జాపత్రి, తవక్షీరి, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, వుసిరికలు, కురంజివాము, కురాసాని వాము, వాము, తెల్లనల్లజీలకఱ్ఱలు, మోదుగమాడలు, వాయువిడంగాలు, నాగకేసరాలు, కురువేరు, వట్టివేరు, తుంగముస్తలు, అగరు, రససింధూరం, సునాముఖి, మంచి గంధం, కస్తూరి పసుపు-ఇవన్నీ ఒక్కొక్క తులము, ద్రాక్ష పండ్లు 24 తులాలు, కిస్మిస్ 24 తు; అల్లం 36 తులములు ఆవునెయి[illegible] రెండు శేర్లు, పంచదార 2 వీశలు, ఫిరంగి చెక్క 60 తులాలు, పచ్చకర్పూరం 1 తులము, రజితభస్మం అభ్రకభస్మము, వంగ, నాగం, శిలాజిత్తు కాంతభస్మములు ఒక్కొక్క తులము.

పైన వస్తువులు మెత్తగదంచి వస్త్రకాలితం చేయవలెను అల్లము దంచి నేతిలో దోరగా వేయించవలెను. పంచదారపాకమున అన్నిటిని వేసి పొయ్యినుండి దింపి నేయి వేయవలెను.

గుణము-అత్యుత్తమ బలవర్ధక రసాయనము. చర్మవ్యాధులు నయమగును, శరీరమును సక్రమ స్థితిలో నుంచగల దివ్యౌషధము.

డా॥ బ్రహ్మశ్రీ ఉపమాక బ్రహ్మయ్యగారు తరతరములనుండి వచ్చు ఈయోగమును 60 సం॥ వైద్యవృత్తిలో వేలాది ప్రజలకు తాను తయారు చేసియిచ్చి ఘనకీర్తిని పొందిరి. మహర్షితుల్యులగువారు ప్రజాక్షేమము కొరకు మాకీయోగమును ప్రసాదించిరి. కృతజ్ఞులము. సం॥

# పానకములు

**1.** శారిబాదిపానకం:—

సుగంధి వేళ్ళ పొట్టు - 6¼ తులములు, మంచిగంధం పొడి:- 8 తులములు, ఏలకాయలు - 3 తులాలు, వట్టివేరు, ద్రాక్ష ఖర్జూరపుకాయ, అతిమధురం ఒక్కొక్కటి 8 తులాలు, శతావరి వేళ్లరసం - 8 పౌనులు, చక్కెర 3 పౌనులు.

శతావరి తప్ప తక్కినవి దంచి 8 ప్రస్థముల నీటిలో ¼ భాగం దిగునట్లు మందాగ్నిలో కాచి, పలుకులు లేకుండా సన్నని గుడ్డలో వడబోసి శతావరి స్వరసం, పంచదార పోసి మందాగ్నిలో కొంచెం తీగె పాకంగా దించవలెను. ఆ వేడితో అందలి నీరు ఇంకిపోవును. చల్లారిన పిదప వడబోయవలెను. మోతాదు:- ½ నుండి 1 ఔన్సు, భోజనానికి పూర్వం రోజుకు రెండు ఔన్సులకన్న అధికం తీసుకోకూడదు.

**2.** శారిబాదిపానకం (రెండవపద్ధతి)

సుగంధిపాలవేరు, వట్టివేరు, చందనంపొడి, లేక చెక్క, ఉసిరిక పప్పు, ఒక్కొక్క భాగం వక్కముక్కగ దంచి అన్నిటికి నాల్గురెట్లు నీరుపోసి ¼ దిగునట్లు కషాయంకాచి వడియగట్టి, అందు 4 భాగముల చక్కెరవేసి తేనె పాకంగా దించుకోవలెను. (చక్కెర ఇంచుమించు కషాయమునకు సమముగ చేర్చవలెను.)

గుణము:- భ్రమ, దాహం, దప్పి, ఒడలు తిరుగుట, కండ్ల మంటలు మొదలగు పిత్త వికారములు నశించును, మిక్కిలి

శ్రేష్ఠమైన రక్తశుద్ధి - చల్లదనము నిచ్చును. ఎల్లప్పుడు ఉష్ణ ప్రదేశములలో పనిచేయువారికి హితమైనది.

మోతాదు:— ½ నుండి 2 ఔన్సులు, కెట్టింపునీటితో.

NOTE·- వేసవిలో ఆరోగ్యకరమైన పానీయము. వారి వారి రుచినిబట్టి, చక్కెరనీరు చేర్చుకోవచ్చును,

3. స్వర్ణముఖి పానకము:—

సునాముఖి 6 ఔన్సులు, ధనియాలు, శొంఠి, జీలకర్ర, చేదు పుచ్చ, శేలగుజ్జు. ఒక్కొక్కటి 4 ఔన్సులు గ్రహించి, చెక్కముక్కగ నలుగగొట్టి వాటికి 4 శెట్లు నీరుపోసి నాల్గవ భాగము మిగులునట్లు కాచి, వడియగట్టి, అందు చక్కెర 7½ పౌనులు వేసి పాకంగా కాచి సేవించవలెను,

గుణము:- మంచి విరేచనకారి, భ్రమ, మలబద్ధకము, అగ్నిమాంద్యము, ఉదావర్తం (ఎక్కిళ్ళు) మొదలగు వానిని పోగొట్టును. మంచి రుచి పుట్టించును.

4. మామిడిఫలరసాయనం:—

మామిడిఫలములు 12 పౌనులు ముక్కలు చేసి. నిమ్మకాయ ముక్కలు 8 పౌనులు గ్రహించి, రోటిలో కొంచెం విలియ గొట్టి, 72 ఔన్సుల నీటిలోపోసి బాగా రెండు మూడుసార్లు వడగట్టి అందు 18 పౌనుల చక్కెరవేసి తేనె పాకంగా దించి యుంచుకొనవలెను,

గుణము.- దాహం, దప్పి. భ్రమ, కండ్లమంటలు, ఒడలు

మంటలు, దద్దులు. అధికోష్ణము, ఇతరమైన పిత్త వికారములు వాంతులు, రక్తదోషము నివారించును. మృదువిరేచనకారి,

గర్భిణీస్త్రీలకు:- అజీర్ణము, అగ్నిమాంద్యము మొదలగు వానిని పోగొట్టి, సుఖప్రసవము చేయుటగాక, బిడ్డకుఆరోగ్యము కలుగజేయును, బలహీనులకు, బిడ్డలకు మంచిది. స్వర్ణసూర్యావర్తితో కలిపిఇచ్చిన ఎటువంటి తీవ్రపైత్యమును పోగొట్టును. స్వర్ణసూర్యావర్తి సంయోగమువలన పైత్యోన్మాదమును పోగొట్టును. అధిక రక్తప్రసరణ, అల్ప రక్తప్రసరణ (High and low blood preasure) మీద బాగా పనిచేయును.

5. వాసకంటకారి పానకం:-

అడ్డసరంఆకు 10 పౌనులు, వాకుడుసమూలం 10 పౌన్లు, పక్కముక్కగ దంచి, 80 పౌనులు నీరుపోసి 20 పౌనుల కషాయం మిగులునట్లు కాచి, వడగట్టి అందు 20 పౌనులు చక్కెర కలిపి తేనెపాకంగా దించవలెను.

గుణము:- రక్తపిత్త, రక్తదోష, పంచవిధములకాసలు, శ్వాస, ఉబ్బసం, దగ్గు శమించును.

6. బిల్వపానకం:-

మారేడుపండ్లు 2 పౌనులు చిన్నముక్కలుగ దంచి 32 పౌనుల నీటిలో వేసి నాల్గవభాగం మిగులునట్లు కాచి, చక్కెర వేసిపాకంగా కాచవలెను.

గుణము:— అతిసారం, రక్తపిత్తం, పిత్తవికారం మొదలగు వానిని శమింపజేయును, హృదయమునకు హితమైనది.

7. పంచతిక్తపానకము:—

నేలవేము, కటుకరోహిణి, వేపపట్ట చేదుపొట్ల, రక్తచందనం అడ్డసరపుఆకు, తిప్పతీగె, శొంఠి, పిప్పలి, మిరియాలు ఇవి సమభాగములుగ చేసి, దంచి దీనికి 8 రెట్లు నీరుపోసి, నాల్గవ వంతు మిగులునట్లు కాచి, కషాయానికి $1\frac{1}{2}$ భాగము చక్కెర వేసి తేనె పాకంగా కాచవలెను.

గుణము:— విషమజ్వరములు, పురాణజ్వరములు: యకృత్ ప్లీహా, వృద్ధులు, మలబద్ధకము పోవును, ముఖ్యముగా చలి జ్వరము లందును, సన్నిపాత జ్వరములందును, వాడతగినది. చలిజ్వరమున కొద్ది మోతాదులో క్వైనైన్ యిస్తూ, పానకం ఈయవచ్చును.

NOTE:- దీనిని సముద్రతీర ప్రాంతములలో ముజ్జిష్టుగా జ్వరములు వచ్చినపుడు ఈ పానకము విశేషముగా రోగులకు పంచిపెట్టినాము. మంచి ఫలితము కనిపించినది. స్వానుభవము.

8. జంబీరాది పానకము:-

అల్లపురసము ఒక భాగము, మంచినిమ్మరసం 6 భాగములు, నీరు 5 భాగములు, చక్కెర 15 భాగములు వేసి తేనెపాకంగా కాచవలెను.

గుణము:- మూత్రమునందలి రాళ్ళను కరగించును. దప్పికను పోగొట్టును. అరుచిపోవును. వేడిచేత మూత్రమురాక బాధపడువారికి యిది అమృతమువంటిది. ఎండాకాలమందు వడ తగిలినవారికి ఒక ఔన్సు పానకమున 4 అవున్సులు నీరు చేర్చి, మంచుగడ్డ కలిపి ఈయవచ్చును. దీనివలన శరీర తాపము పోవును. రెండుపూటలా సేవించిన రక్తము శుద్ధి యగును, క్షారపదార్థములవలన కలుగు చెడును పోగొట్టును.

9. కూష్మాండ పానకం:-

కూష్మాండ స్వరసం నాల్గుశరావములు, చక్కెర 2½ వీశె తేనె ½వీశె, బూడిదగుమ్మడికాయ చెక్కతీసి ముక్కలు తరిగి దంచి గుడ్డలో వేసి పిండి రసంతీసుకోవలెను. చక్కెరకు సమ భాగం నీళ్ళుపోసి చక్కెర కలియువరకు కాచి వడగట్టి, పైరస మును కలిపి తేనె పాకంగా కాచి దించవలెను. తర్వాత వడ గట్టి, చల్లారిన పిదప తేనె కలుపవలెను.

రక్తపిత్తము - క్షతముచే కలిగిన క్షయ, దప్పికవలన కలిగిన జ్వరం, నివర్తించును.

గుణము:- వీర్యవృద్ధి, పుష్టి, మంచివర్ణము, మంచి స్వరము పుట్టించును. అపస్మారమందును, మనోవ్యాధులందును, పిత్తసంబంధమయిన రోగములందును, యథోచితముగ ఉప యోగించవచ్చును.

మోతాదు:- 1 డ్రాం వేసి 1 ఔన్సు మంచినీటిలో చేర్చి,

దినానికి రెండుసార్లు లేక మూడు సార్లు కూడ తీసుకొన వచ్చును.

10. జలోదర పానకము:—

ఖర్జూరపుకాయలు, పెద్దద్రాక్షపండ్లు చిన్నద్రాక్షపండ్లు ఆల్బొకారాపండ్లు. సీమ అత్తిపళ్ళు వీటిని రాత్రినానవేసి ఉదయం బాగాపిసికి వడకట్టి ఒకఔన్సు త్రాగుచుండవలెను. గుణము:—జలోదరము పోవును హృద్రోగములను గొట్టును. అత్యుష్ణమును తగ్గించును.

---

# రసాయనములు

1. బ్రాహ్మీరసాయనము:—

సరస్వతి ఆకు స్వరసం 1 పౌను, కరక్కాయ దాల్చిన (దాసిం) చెక్క, ఆకుపత్రి, పిప్పలి, ఒక్కొక్కటి ఒక్కొక్క తులం, చక్కెర 40 తులములు కళాయి పాత్రలో రసము, చక్కెర వేసి కాచుచు అందులోపై వస్తువుల చూర్ణంవేసి తేన పాకముగా దింపవలెను. చల్లారిన పిదప సన్నని గుడ్డలో వడబోసి ఉంచుకోవలెను. ఇందు 32 తులములు తేనవేసి కలిపిన శ్రేష్ఠము.

బ్రాహ్మీరసాయనము (రెండవపద్ధతి):—

బ్రాహ్మీస్వరసం 10½ శేరు కొలత. లేక సరస్వతీఆకు ఎండినది 4 వీశెలు, నీరు 36 శేర్లలో పోసి, 10 శేర్లు కషాయము

మిగులునట్లు కాచి, అందు చక్కెర 9 వీశెలు చేర్చి తేనపా కంగా దించవలెను.

మోతాదు:— ½ ఔన్సు మందు రెట్టింపు నీళ్ళలో కలిపి త్రాగవలెను,

గుణము:— మనోవికారము, ఉన్మాదము, మూర్ఛ, కఫ, వాత సంబంధమైన వికారములు, నెమ్మదించును. బుద్ధివికాసము, ధారణాశక్తి, ఆయుర్వృద్ధి, కలుగును ధాతువులకు బలమిచ్చి హృదయమునకు పుష్టిచేయును. మిక్కిలి శ్రేష్ఠమయిన రసాయనము.

**2. బృహత్ బ్రాహ్మీరసాయనము;—**

అయిదు విధములగు పంచమూలములు (చివర వివరణ చూచు నది) పదేసి పలములు, వేయికరక్కాయలు, మూడువేల ఉసిరికకాయలు, వీనికి పదిరెట్ల నీటియందుంచి, పదవవంతు మిగులునట్లు కాచి, వడపోయవలెను. అందలి కరక, ఉసిరిక గింజలను తీసివేసి మెత్తగ నూరి ఆ కషాయములో వేయ వలెను,

మరియు అందు:—

15 పలములు పటికబెల్లపు చూర్ణము, వెయ్యి పలములు పిప్పళ్ళు, శంఖపుష్పి, కైవర్తముస్తలు, తుంగగడ్డ, వాయువిడంగం, మంచిగంధం, అగరు, అతిమధురం, పసుపు, వస, నాగకేశరాలు, ఏలకులు (గింజలు), దాల్చినచెక్క — వీటి చూర్ణములు నాలుగేసి పలములు, నువ్వులనూనె రెండు ఆఢ

కములు, నేయి మూడు ఆఢకములు - వీనిని అన్నింటిని కలిపి తామ్రపాత్రలో ఉంచి సన్నని మంటచే వండవలెను. గరిట జారుపాకమున నుండగా 1 ఆఢకం తేనె కలిపి నేతితో మాగిన కుండ నుంచి ధాన్యరాశియందుంచి మాగునట్లు చేయవలెను, సుమారు మూడుదినములుంచవలెను. పిమ్మట సీసాలలో ఉంచుకొని ప్రతిదినము సేవింపవలెను. మోతాదు- 3, 4 చెంచాలు పాలతోగాని నీటితోగాని కలిపి పుచ్చుకొనవలెను.

గుణము:- మానసిక వికారములను అన్నిటిని పోగొట్టును. వ్యాధిరహితులును సేవింపవచ్చును. ఆరోగ్యవర్ధకమగు రసాయనము.

8. పంచామ్లక రసాయనము:-

కరక, తాడి, ఉసిరిక, అయిదు విధముల పంచమూలములు- ఇవి సమభాగములుగ తీసికొని కషాయం కాచి, అందు పిప్పలి, అతిమధురం, ఇప్పపూవు, కాకోలి, క్షీరకాకోలి, దూలగొండి విత్తులు, జీవకం, ఋషభకం, పాలగుమ్మడి - వీని కల్కమును, పాలను, పాలకు 8 రెట్లు నేలగుమ్మడిరసమును, రెండుద్రోణముల నీటిని వేసి గరిటజారు పాకమున ఉండునట్లు తయారు చేయవలెను.

మోతాదు 2, 8 చెంచాలు.

గుణము:- బలవర్ధకరసాయనము, వ్యాధులను రాకుండ కాపాడును.

# అరిష్టములు

## 1. ద్రాక్షారిష్టము :_

50 పలముల ద్రాక్షపండ్లు రెండుద్రోణముల నీటిలో వేసి నాల్గవవంతు మిగులునట్లు కాచి వడకట్టి అందు పాతబెల్లము 200 పలములు, దాల్చిన చెక్క, ఏలకులు, నాగకేసరాలు, ఆకుపత్రి, ప్రియంగు, మిరియాలు, పిప్పలి, వాయువిడంగం— ఒక్కొక్క ఫలంచూర్ణంచేసి, బాగాకలిపి కషాయపాత్రలోపోసి బాగుగా కలిపి ఆపాత్రకు గట్టిగా సీలమన్ను వేసి ఒక నెలపిదప వడకట్టి వాడవలెను. బెల్లమునకు బదులు పంచదార వాడుచున్నారు. మోతాదు_ అరఔన్స మందు అరఔన్సు నీరుకలిపి భోజనం తరువాత రెండుపూటల వాడవలెను.

గుణము:— దగ్గు, ఆయాసము, మలబద్ధకము పోవును. హృదయమునకు బలము కలిగించును. గుండెదడ తగ్గించును. ఇంకను అనేక సుగుణములు కలిగించును.

## 2. వాసారిష్టము—

అడ్డసరము సమూలముగా తెచ్చి శుభ్రము చేసి 12 వీసెలు తూచి మెత్తగాదంచి 48 శేర్ల నీటిలో పోసి నాల్గవభాగము మిగులునట్లు కాచి వడకట్టి, అందు మూరుపలముల బెల్లము చేర్చి అందు ధాతకీ 8పలములు, దాల్చిన చెక్క, ఏలకులు, నాగకేసరాలు, ఆకుపత్రి, ధనియాలు, మిరియాలు, శొంఠి, పిప్పలి, కురువేరు, కచూరాలు — ఒక్కొక్క పలం బాగాచూర్ణంచేసి

ఒకపాత్రయందు ఉంచి సీలమన్నుతో బిగించి ఒక మాసము దిబ్బ పడగట్టి ఉపయోగించుకొనవలయును.

ఆసవారిష్టములన్నియు ½ ఔన్సుమొదలు 1 ఔన్సునీరు కలిపి సేవించవలెను.

గుణము— శ్వాసకాసలకు సాటిలేనిమందు. చ్యవనప్రాసతో సేవించిన ఎటువంటి దగ్గులైనను తగ్గును

౧. దశమూలారిష్ట—

ముయ్యాకుపొన్న, కొలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, మారేడు, నెల్లి, పెద్దమాను. చిగురుమ్మిడి. కలిగొట్టు— అనుదశమూలములను దంచిపొడి చేసి దానిని 50పలములు. చిత్రమూలము 25పలములు. తిప్పతీగ 20పలములు, ఉసిరిక 16పలములు, దురదగొండి 12పలములు, ఖదిర(చంద్ర) 8పలములు, కరక్కాయ 8పలములు, చెంగల్వకోష్టు, మంజిష్ఠ, దేవదారు, వాయువిడంగం, యష్టిమధుకము, గంటుభారంగి, వెలగచెట్టుపట్ట. తాడికాయ, గలిజేరు, జటామాంసి, ప్రియంగు, సుగంధిపాల, నల్లజీలకర్ర, త్రివృతి, రేణుకలు, సన్నరాష్ట్రం, పిప్పలి, పోకకాయ, కచూరాలు, పసుపు, సదాప, కద్మకాష్ఠము, నాగకేసరాలు, తుంగముస్తె, కొడిశపాలవిత్తులు, జీవకం (గుడూచి) ఋషభకం (విదారి) మేద (అశ్వగంధ) కాకోళి (శతావరి) క్షీరకాకోళి, ఋద్ధి (నేలతాడి) ఇవి ఒక్కొక్కటి రెండుపలములు. అన్నిటిని మెత్తగా దంచి 8 రెట్లు నీటిలోవేసి నాల్గవవంతు మిగులునట్లు కాచి కుండయందు వడపోసి ఉంచుకొనవలెను.

ద్రాక్షపళ్ళు 60 పలములు నాలుగురెట్ల నీటిలో వేసి, మూడవవంతు మిగులునట్లు కాచి వడగట్టి పై కషాయమందు పోయవలెను. తేనె 32 పలములు, బెల్లం 60 పలములు, ధాతకి 30 పలములు, కంకోలం, వట్టివేరు, రక్తచందనం, జాజి కాయ, లవంగం, దాల్చినచెక్క, ఏలకులు, నాగకేసరాలు, పిప్పళ్ళు, ఒక్కొక్కటి రెండుపలాలు, కస్తూరి అరతులం- వీనిని చూర్ణించి పై కషాయమున కలిపి కుండను సీలమున్న వేసి ఒక మాసముంచి వడగట్టి సేవించవలెను.

గుణములు:- సకలవ్యాధులకును అనుపానముగ వాడిన చక్కగా పని చేయును. వాతవ్యాధులకు పెట్టినది పేరు. స్త్రీల వంధ్యత్వమును పోగొట్టును. జ్వరములను తగ్గించును. వ్యాధి నిరూపణ కాక బాధపడువారు సేవించిన పది రోజుల లో బాగుగ గుణము కనుపించును. కృశత్వమును, స్థౌల్యము ను హరించును.

4. ఫలారిష్టము:-

కరక, ఉసిరిక, తాడికాయ- ఇవి ఒక్కొక్క ప్రస్థము, పెద పావర, వెలగ, చిరుబొద్ది, చిత్రమూలము, రెండేసి పలములు దంచి 25 శేర్లు నీటిలో పోసి నాల్గవవంతు మిగులునట్లు కషా యంకాచి వడబోసి, అందునూరు పలముల బెల్లము కలిపి నేతితో మాగినకుండలో పోసి ఒక నెల దినములు ఉంచి పిదప సేవించవలెను.

గుణము:- గ్రహణి, అర్శోరోగము, హృద్రోగము, కామెల

విషమజ్వరము, మల బద్ధకము, అగ్నిమాంద్యము, దగ్గు తగ్గును.

5. అశోకారిష్ట:—

అశోకపుపట్ట 100 తులములు, 4 ద్రోణముల నీటిలో వేసి పాతిక భాగము మిగులునట్లు కాచి అందు 265 పలములు బెల్లముకలిపి ధాతకీ పుష్పము 64 తు॥ అజామోదం 4 తు॥ తుంగముస్తలు, శొంఠి, మానుపసుపు, ఎండిన కలువ దుంప, త్రిఫలములు— జీలకర్ర, అడ్డసరం ఆకు, మంచిచందనము చెక్క— దినుసునకు నాలుగేసి తులాలు కల్కం చేసి కషాయమున వేసి చీలమన్ను బిగించి ఒకనెల ఉంచిన తరువాత వడకట్టి సేవించవలెను.

గుణము— స్త్రీల చర్విధ కుసుమరోగములు పోవును. ఋతుశూల, యోనిశూల, వంధ్యాత్వదోషము హరించును. గర్భాశయమును శుద్ధి చేయును. ఋతుక్రమమును సరిచేయును.

# మాత్రలు

1. కాసమర్దన మాత్రలు:—

శొంఠి, పిప్పలి, మిరియాలు, సమభాగములు, దానిమ్మచెక్క— 4 భాగాలు— వీటిని మెత్తగా దంచి, చూర్ణానికి మూడు రెట్లు బెల్లము వేసి పాకంపట్టవలెను. అరతులం ఒక మాత్ర చేసి ఉంచుకొనవలెను. 1, 2, మాత్రలు వాడినంతనే ఎటువంటి దగ్గు అయినను తగ్గి తీరును. స్వానుభవము.

**2.** అష్టాక్షరి ఘుటిక:-

పిప్పలి, ఇంగిలీకం, నల్లమందు, చందనం, రక్తచందనం, జాజికాయ, ఇంగువ, అతివస-- సమభాగాలు. వీనిలో పిప్పళ్లను వేయించి, ఇంగువను నేతిలో పొంగించి చూర్ణించి. నల్లమందును బాగా నేతితో నలిపియు, ఇంగిలీకమును నిమ్మరసంతో మర్దించియు, తక్కిన వాటిని చూర్ణించియు, అన్నిటిని కలిపి మరల మెత్తగా నూరవలెను.

బిల్వకషాయము, జీలకర్ర, దురదగొండి, తుంగముస్త, ధనియాలు, వాము, నిమ్మరసంతో ప్రత్యేకముగా ఒక్కొక్క రోజు మర్దనచేయవలెను. గురిగింజంత మాత్రలు చేయవలెను. దినమునకు రెండు మూడు మాత్రలు మజ్జిగతో గాని గసాల రసంతోగాని వాడవచ్చును.

గుణము:- అతిసారవిరేచనములు, గ్రహణి, నివర్తించును, కడుపుబ్బరమున్న. వాముకషాయముతో ఇచ్చిన తగ్గును.

**3.** కస్తూరి మాత్రలు:-

కస్తూరి మూడు చిన్నాలు (12 గురిగింజల తూకం) కుంకుమపువ్వు 3 చిన్నాలు, లవంగాలు, జాజికాయ, జాపత్రి, శొంఠి. మిరియాలు, మోడి - ఒక్కొక్కటి $\frac{3}{4}$ తులము తీసికొని మెత్తగా దంచి తమలపాకు రసంతో మర్దించి మాత్రలు చేయవలెను. (ఆవగింజంత)

గుణము:- జలుబు, దగ్గు, జ్వరం తగ్గును. చిన్నపిల్లలకు

అధికముగా ఉపయోగకరము. దేహము చల్లబడినపుడు వేడిని కలుగచేయును.

4. బాలసంజీవిని మాత్రలు:—

శొంఠి ఒకపలము, గోరోజనము ⅛ పలము, కాల్ మేల్ COLOMEL ½ పలము, కుంకుమపువ్వు ⅓ పలము, అన్నిటిని బాగుగనూరి పెద్ద ఆవగింజంత మాత్రలు చేయవలెను.

గుణము:— బాలచేష్టలకు (చంటిబిడ్డగుణము), అజీర్ణము, వాయువు, ఏలికపాములు హరించును.

5 లవంగఘుటికలు:—

లవంగములు, మిరియాలు, తాడికాయబెరడు, సమభాగములుగ చూర్ణించి ఆ పొడిని చంద్రచెక్క కషాయముతోను, నల్లతుమ్మచెక్క కషాయముతోను భావనచేసి నీడను ఎండించి శెనగ గింజంత మాత్రలు చేయవలెను. ఒకమాత్ర నోటిలో ఉంచుకొని సారము మ్రింగుచుండవలెను.

గుణము:— దగ్గు, ఉబ్బసము హరించును.

6, సప్తానంద భైరవి:—

శోధితగంధకం, శోధితనాభి, ఇంగిలీకం శొంఠి, పిప్పలి, మిరియాలు, పొంగించిన వెలిగారము - రెండేసి తులాలు. నాభిని పొడిచేసి విడిగా శొంఠి పిప్పలి మిరియాలను పొడిచేసి, శోధిత గంధకము కల్వమందు మెత్తగా నూరి తరువాత ఇంగిలీకమును అందులోవేసి నూరి తరువాత శొంఠి మొదలగు ద్రవ్యముల పొడిని వాటితో కలిపి నిమ్మకాయరసముతో వారము రోజులు బాగుగమర్దనచేసి మాత్రలు (చిన్నశెనగగింజంత) చేయవలెను.

గుణము:- సకలజ్వరములను నివారించును. అజీర్ణంపోగొట్టి ఆకలి కలిగించును. అజీర్ణమునకు అల్లపురసముతో సేవింపవలెను. తేలుకుట్టినపుడు ఒకమాత్ర మ్రింగి ఒకమాత్ర జిల్లేడు పాలతో చాది కుట్టినచోట పూసిన ఒక గంటలో బాధ తగ్గును.

7. శీతాంశురసము:-

శోధితమణిశిల, శోధితతాళకము, ఒక్కొక్క భాగము, శొంఠి మిరియాలు, పిప్పలి - రెండేసిభాగాలు కల్వమందుంచి నిమ్మకాయ రసముతో మర్దించవలెను. తరువాత వేపచెక్క కషాయముతో మరలనూరి చిన్నశనగగింజంత మాత్రలు చేయవలెను.

గుణము:- శీతజ్వరమును హరించును మాదీఫలరసముతో సేవించిన వాంతులను అరికట్టును. దిరిశెనఆకు రసముతో లేక ఊదుగుచెక్క రసముతో విషజంతువు కరచినచోట వ్రాయుటయు, లోపలికి ఒకమాత్ర సేవించుటయు చేసిన విషబాధానివారణ జరుగును. కాకరాకు రసముతో మాత్ర అరగతీసి కంటిలోపెట్టినజ్వరితులు సంగ్రహించుటవలన కలుగు దోషమును పోగొట్టును. వేము, నేలవేములచూర్ణమును 4 మాత్రలు పొడిచేసి నేతితోకలిపి పైకివ్రాసిన గజచర్మము, తామర, చిడుము, కుష్టువంటి చర్మవ్యాధులు పోవును. వావిలాకు రసముతో కలిపి నస్యము చేయించిన తలనొప్పి అపస్మారము పోవును.

గమనిక:— సప్తానంద భైరవిలో శోధితగంధకము, దీనిలో మణిశిల కలియును. ఇవిసరిగాశుద్ధిజరుగక పోయిన ప్రమాదము అనుభవరహితులు ఇటువంటివాటిని పరిహరించుట మంచిది.

8. మిరియాలమాత్రలు:-

వెఱ్ఱిపుచ్చకాయకు రంధ్రము చేసి అందు మిరియాలు పెట్టి రంధ్రము పూడ్చివేసి సన్నని సెగలో (వంట అయిన తరువాత పొయిలోని బూడిద) 4, 5 రోజులు పెట్టి, అందలి మిరియాలు తీసి ఎండించి దాచవలెను.

గుణము:— ఒక్కొక్క మాత్రకు ఒక్కొక్కటి చొప్పున, ఎన్ని మిరియాలు మింగిన అన్ని విరేచనములగును. కడుపులో మెలిపెట్టదు. వాంతులు కావు.

9. సూరణాదివటిక (అర్శోహరి మాత్రలు)

కందగడ్డలను ముక్కలు చేసి ఎండపెట్టి చేసినపొడి 8 తులాలు, చిత్రమూలం (తోలు) 4 తులాలు, కరకచూర్ణం 1 తు, శొంఠి 1 తు, మిరియాలు అరతులం, మెత్తగా చూర్ణముచేసి బెల్లము 14 తు। వేసి మర్దించి లేక బెల్లపుపాకములో వేసి చిన్న కుంకుడుకాయంత మాత్రలు చేసి రెండుపూటల సేవింపవలెను, వ్యాధిస్థితినిబట్టి 1, 2 మండలములు తీసుకొనవలయును,
గుణము — మూలవ్యాధి తప్పక నశించును. మలబద్ధకము ఉదరరోగములు పోవును దీనికి తోడుగా గొలుగుపండ్లు లభించినయెడల తినుట మంచిది. నులిపురుగు నశించును. మూడు పూటల మూడేసి తులసిదళములను తినినను నులిపురుగు

తప్పక నశించును. నలిపురుగు నశించుటకు తులసిదళ సేవ
నము సాటిలేని దివ్యౌషధము.

**10.** తులసి మాత్రలు (చలిమిరియము)

రాత్రి మజ్జిగలో ఒక మిరియము నానవేసి ఉదయము ఒక
తులసీదళముతో కలిపినూరి మాత్రచేసి మింగించవలెను. రెం
డవ రోజున రెండు మిరియాలు, రెండు తులసీదళములు ఈ
విధముగ హెచ్చించుచు 9 వ రోజున 9 మిరియాలు రాత్రి
నానవేశి ఉదయం 9 తులసిదళాలు చేర్చి నూరి 9 మాత్రలు
చేసి మింగవలెను.

గుణము:— పై విధముగ 9 రోజులు చేసిన తరచుగా జ్వ
రము వచ్చుచుండుట మానును, దీర్ఘజ్వరములు తగ్గును.
ఆకలి కలుగును. నలిపురుగు నశించును.

# అంజనములు

**1.** నేత్రాంజనము:—

మునగాకు రసంలో తేనెవేసి, నేత్రములందు వేసిన సకలనేత్ర
రోగములు హరించును. ఇది మంచి సులభయోగము.

**2.** సూరతు అంజనము:—

కురవిరాళ్ళు సూరతు కరక్కాయలు, సైంధవలవణము, మాని
పసుపు - వీనిని మంచినీళ్ళతో నూరి కంటిచుట్టు పట్టించుచుం
డిన సకల నేత్రరోగములు పోవును,

**3.** హారీతకీ అంజనం:—

కరక్కాయలు మూడుభాగములు, తాడికాయ రెండుభాగాలు

ఉసిరిక ఒకభాగము పొడిచేసి నీటితో నూరి ఉండలు చేసి నీడను ఎండించి యుంచుకొనవలెను. అవసరమైనపుడు ఒక ఉండ నీటిలో చాది కన్నులకు వేశిన నొప్పులుపోవును.

4. నేత్రబిందువు:-

జింకుసల్ఫేటు (యశదగంధకితము) ఒకభాగము, పటికారం ఒక భాగము, వెలిగారం అయిదుభాగములు, 32 భాగాల పన్నీటిలోగాని మంచినీటిలోగాని చక్కగ కలిపి వడపోయవలెను.

మోతాదు:- 1, 2 చుక్కలు ఉదయం సాయంకాలం కంటిలో వేయవలెను.

గుణము:- కండ్లకలకలు మానును. కన్నులు కడుగుకొనుటకు నిరపాయకరమైనది. కాగి చల్లారిన నీరు అధికముగా చేర్చి గోరువెచ్చగా అన్నికండ్లరోగములందును కడుగవచ్చును. అప్పుడు పుట్టిన బిడ్డలకు ఈ నీటిలో తడిపిన మెత్తని దూదితో కండ్లు తుడిచిన, తల్లిదండ్రులకు సంబంధించిన అంటు వ్యాధులు సోకవు.

5. మాచిపత్రి అంజనము:-

మాచిపత్రిని వెచ్చవేసి కన్నులపై పెట్టికట్టియుంచిన ఎరుపులు, మంటలు తగ్గును.

గమనిక:- సకల నేత్రవ్యాధులందును అత్యుత్తమ దివ్యౌషధము స్వర్ణభస్మమునకు రెండు రెట్లు త్రిఫలచూర్ణమును కలిపి సేవించుట. స్వర్ణమునకు బదులుగ రజితభస్మమును వాడుదురు, కాని అంతటి గుణకారి కాదు.

# కషాయములు

1. దవన కషాయము:—

దవనం ఆకును ఎండించి చూర్ణించి అందు 1తులం పొడికి ¼ శేరు నీరు పోసి ¼మిగులునట్లు కాచి వడకట్టి దించి కొంచెం చక్కెర కలిపి త్రాగవలెను. రోజుకు రెండుసార్లు.

గుణము:— మసూచికము, ఆటలమ్మ— వీటిని అరికట్టును. ఈకషాయము ఈరోగములు రాకుండుటకుకు త్రాగవచ్చును. (Preventive & Curative)

2. నింబ కషాయము:-

వేప, చింత, నల్లి - వీటి ఈనెలు బంగారు చాయగా వేయిం చి, ఓమం, వాయువిడంగం నలియగొట్టి కషాయము కాచి యివ్వవలెను.

గుణము:— మలబద్ధకము తొలగును. మసూచికమునను వాడ వచ్చును.

3. షడంగకషాయము:—

తుంగగడ్డ, పర్పాటకం, వట్టివేళ్ళు, మంచిగంధము, ఏలకులు, శొంఠి - ఇవి సమభాగాలుగ చేసి దంచి కషాయముగ కాచి అరఔన్సు మందు రోజుకు రెండు మూడు మారులు త్రాగిం చిన, దప్పికతోకూడిన జ్వరము తగ్గును.

4. పంచతిక్త కషాయము:—

తిప్పతీగ, వాకుడు, ములక, చేదుపొట్ల వేపచెక్క, ఇవి నాలుగేసి పలాలు మెత్తగ దంచి ఎనిమిదిరెట్లు నీరుపోసి రెండు వంతులు మిగులునట్లు కాచి వడపోయవలెను,

గుణము:- రక్తశుద్ధి, జ్వరహారము.

5. ఉసిరిక కషాయము:-

తిప్పతీగ, నేల వేము (సీమ), కరక, తాని, ఉసిరికలు, పసుపు, కటుకరోహిణి-- వీటిని దంచి కషాయుంకాచి బెల్లము కలిపి వడకట్టవలెను.

గుణము:- శిరశూలలు, ఒంటికణతనొప్పి, కర్ణశూల, నేత్ర శూల, దంతశూల, కనుబొమ్మలయొక్క నొప్పి సూర్యావర్తము (సూర్యోదయముతో ప్రారంభించి క్రమముగా హెచ్చి సూర్యాస్తమయముతో తగ్గు తలనొప్పి) నేత్రవ్యాధులు- కంటి పువ్వులు, రేచీకటి వంటివికూడ తగ్గును. వ్యాధిస్థితిని బట్టి కొంతకాలము సేవింపవలసి యుండును.

6. తిప్పతీగ కషాయము:-

తిప్పతీగ, ధనియాలు, తుంగముస్తలు, వట్టివేరు, కురువేరు, పెదమాను చెక్క, అతివస, ముత్తవపులగము, పర్పాటకము, దురదగొండి, -- సమభాగములుగ దంచి రాత్రి నీటిలో నానవేసి ఉదయమున బాగుగ పిసికి కషాయముగ కాచి వడ కట్టవలెను. దీనిని శీతలరసముగను తీసికొనవచ్చును.

గుణము:- వేడి తగ్గును జ్వరము, ఆమాతిసారము పోవును. ప్రసవానంతరం స్త్రీలకు మైల వెడలుటకు బాగుగ ఉపయోగించును.

7. పథ్యాదికషాయము:-

త్రిఫలములు, నేల వేము, పసుపు, వేపచెక్క, పిప్పలి,-- ఇవిసమ

భాగాలు, కషాయము కాచి అందు తగినంత బెల్లము కలిపి వడగట్టవలెను. ½ ఔన్సు మందు రెండుపూటల సేవించవలెను.
గుణము:- సకల శిరోవ్యాధులు, నేత్రరోగములు, కర్ణరోగములు శమించును.

8. అమృతాదికషాయము:-

తిప్పతీగ, త్రిఫలములు, పిప్పళ్ళు చూర్ణము చేసి నాలుగు రెట్లు నీరుపోసి సగమగునట్లు కాచి వడకట్టవలెను. ఇందు తేనె కలుపవచ్చును. రెండుపూటల 6 నెలలు సేవించిన సకల నేత్రవ్యాధులు శమించును.

9. వాసాదికషాయము:-

అడ్డసరము, శొంఠి, తిప్పతీగ, మానెపసుపు, రక్తచందనము, చిత్రమూలము, నేలవేము, వేపచెక్క, కటుకరోహిణి, చేదుపొట్ల, త్రిఫలములు, తుంగముస్తలు, యవలు, పుచ్చవేరు, కొడిశపాలవిత్తులు - ఇవి సమభాగాలు చేసి మొత్తగదంచి కషాయము కాచి వడగట్టవలెను. బెల్లమును గాని తేనెను గాని కలుపవచ్చును.
గుణము:- స్వరభంగము, పీనస, ఆయాసము, నేత్రవ్యాధులు, పోవును.

10. చలిజ్వర విధ్వంసి కషాయము:-

ఇప్పవేళ్ళపట్ట, వేపవేరుపట్ట, నేలవేము, తురకవేపపట్ట, మామిడివేరుపట్ట, విష్ణుక్రాంత - ఇవి ఒక్కొక్క భాగము, శొంఠి ½ వంతు, మిరియాలు ¼ వంతు రేవలచిన్న ⅛ వంతు,

 Acno 205

నల్లజీలకఱ్ఱ పదినారవవంతు, తుమ్మవేళ్లు, తెల్లజిల్లేడు - ఒక భాగము ఇవన్నియు మెత్తగా దంచి 16 రెట్లు నీరుపోసి కాచి ఒకవంతు మిగులునట్లు కాచి వడగట్టవలెను. అరఔన్సు మందు మోతాదు రెండుపూటల త్రాగవలెను. అవసరముబట్టి 5 గంటలకు ఒకమారు ఇవ్వవచ్చును.

గుణము:— సకల చలిజ్వరములు తగ్గును.

NOTE:-సముద్రతీరపు గ్రామాలలో ముమ్మరముగ చలిజ్వరములు వచ్చినపుడు ఈ కషాయద్రవ్యచూర్ణమును ఆగ్రామాలలో పంచిపెట్టితిమి. వేలాది ప్రజలకు చక్కగా తగ్గినది: స్వానుభవము.

# లేపనములు

1. సింధూరాది లేపనము:-

రససిందూరము ¼ తులం, గంగసింధూరం 1 తులము, రసకర్పూరము అరతులం, మృదారుశృంగి అరతులము, మైనము 5 తులాలు, కొబ్బరినూనె ఇరవై తులాలు. మైనము పక్వముగా కరగపెట్టి అందులో మిగిలిన వస్తువులువేసి కాచవలెను. కొలదిగ గట్టిపడిన తరువాత సీసాలలో పోయవలెను.

గుణము:— పుండ్లు, గాయాలు, కాళ్ల పగుళ్ళు - వీటికి 3, 4 రోజులు వ్రాసిన తగ్గును.

2. మునగవేరు లేపనము:-

ఆముదపువేళ్ళు, మునగవేరు, శొంఠి, చేదుపొట్ల, అగరు,

చెంగల్వకోష్టు, తంగేడు వేరు - వీనిని పుల్లనీటిలోనూరి శిరస్సు నందు మర్దన చేసిన సకల శిరో రోగములు నశించును.

3. మరీచ్యాది లేపనము:-

తెల్లమిరియాలు 1 పలము జిల్లేడుపాలతో నూరి నడుమునకు పట్టించిన ఎటువంటి నడుమునొప్పియైనను తగ్గును.

4. పాదలేపనము:-

ఇప్పపిండి, సత్తుపిండి మేకపాలుపోసి కాటుకవలె నూరి ఆవు నేయి వేసి కల్కము చేయవలెను.

దీనిని పాదములకు పూసిన పాదముల మంటలు శాంతించును.

5. తురవకాది లేపనము:-

వస, బావంచాలు, నీరుడువిత్తులు, రాతిసిబొగ్గు - ఇవి సమ భాగాలు, హారతికర్పూరము నాల్గవభాగము, మైనము రెండు భాగాలు. మొదట వస, నీరుడువిత్తులు వేర్వేరుగ ఇనప మూకుటి యందు దోరగా వేయించి మెత్తగ పొడుం చేయవలెను. తరువాత మైనముకరిగించి అందు ఒక్కొక్క చూర్ణమే వేసి నూరవలెను. ఇట్లు అన్నీ కలిపిన పిదప చివరగ హారతి కర్పూరము వేసి నూరవలెను.

గుణము:- దురదలు, చిడుము, బొల్లి, మొదలగు సకల చర్మవ్యాధులయందును పనిచేయును. కొబ్బరినూనెలో కలిపియు వ్రాయవచ్చును.

6. శ్వేతకుష్ఠహర లేపనము:-

పసుపు, జాజి, అన్నభేది, వాయువిడంగం, మణిశిల, గోరో

జనం. సైంధవలవణము - ఇవి గోమూత్రముతో నూరి లేపనము చేయుచుండిన శ్వేతకుష్ఠు హరించును.

7. కుష్ట లేపనము:—

కామంచి, తగిరిసెవిత్తులు, చెంగల్వకోష్టు, పిప్పళ్ళు మేకమూత్రముతో నూరి లేపనము చేయుచుండిన 18 విధముల కుష్ఠులు నశించును. (మధుస్నుహి, ఖదిర కడుపులోనికి సేవించుట ఉత్తమము. ఎట్లయినను 1 సంవత్సరము పట్టును).

# ఘృతములు

1. ఫల ఘృతము:—

త్రిఫలములు, యష్టిమధుకము, చెంగల్వకోష్టు, పసుపు, మానిపసుపు, కటుకరోహిణి, వాయువిడంగాలు, పిప్పలి, తుంగముస్తె, పెదపాపరవేళ్ళు, కాయఫలము, వస, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, నల్లసుగంధిపాలు, తెల్లసుగంధిపాలు, ప్రేంఖణము, పెదపదాప, వేయించిన యింగువ, సన్నరాష్ట్రము, చందనము, రక్తచందనము, జాజిపూలు, తవాషీరి, కమలము, వెనురుప్పు, చక్కెర, అజామోదము, నేపాలపువేళ్ళు - వీటిని ఒక్కొక్క తులము గ్రహించి కల్కము చేయవలెను. శరీరమంతియు ఒకేరంగు, జీవించియున్న దూడగల ఆవునెయ్యి ఒకప్రస్తము, దానికి నాలుగింతలు ఆవుపాలు కలిపి అందు పైకల్కము కలుపవలెను. మట్టిపాత్రగాని

తామ్రపాత్రగాని ఉపయోగింపవలెను పుష్యమీనక్షత్రముతో కూడిన మంచిరోజున అడవియేరు పిడకల నిప్పుచే ఘృతపక్వముగ కాచి వడకట్టవలెను.

గుణము:- దీనిని పురుషులు సేవించిన వీర్యదోషములను పోగొట్టి వీర్యవృద్ధి కలుగచేయును. వారు సంతానప్రాప్తికి యోగ్యులగుదురు. వంధ్యాస్త్రీలు సేవించిన సంతానము కలుగును. సంతానములేని దంపతులు ఇరువురు సేవించుట మంచిది. స్త్రీకి గర్భశుద్ధి పురుషునికి వీర్యశుద్ధి (జీవకణాభివృద్ధి) చేయును. గర్భస్రావములు, బిడ్డ పుట్టిన వెంటనే మృతిపొందునట్టి స్త్రీలు సేవించిన, గర్భస్రావము జరగదు. ఆయురారోగ్యవంతమగు సంతానము కలుగును

ఇది భరద్వాజ మహర్షి ప్రోక్తమగు యోగము. ఇందు లక్ష్మణామూలము (తెల్లకాయలుగల మునగ వేరు) చెప్పబడలేదు. అది గర్భధారణను కలిగించు దివ్య ఓషధి. కావున దానిని ఇందు చేర్చుకొనుట అత్యుత్తమము. మోతాదు అర ఔన్సు మందు అరఔన్సు పాలతో గాని నీటితో గాని సేవించవలెను.

2. సుగంధి పాల ఘృతము:-

సుగంధిపాలవేరు, మోదుగచెక్క, వట్టివేరు, తామరగడ్డ, అతిమధురము, అత్తి చిగుళ్ళు, బిల్వఫలము, పెన్నేరుగడ్డ, కలువ దుంపలు - ఇవి సమభాగములుగ గ్రహించి దంచి కషాయముగ కాచి వడపోసి అందు నెయ్యి పోసి ఘృతపక్వముగా కాచి పుచ్చుకొనవలెను.

గుణము:— రక్తశుద్ధి చేయును. అష్టవిధములగు మసూరికలు తగ్గును.

3. ఫలఘృతము (రెండవవిధము)

మంజిష్ఠ, అతిమధురము, ంగల్వాకోష్ఠు, శొంఠి, పిప్పలి, మిరియాలు. చక్కెర, బలామూలం, మేధ, మహామేధ. కాకోలి, క్షీరకాకోలి, పెన్నేరుగడ్డ, వాము, పసుపు, మానుపసుపు, కటుకరోహణి, ప్రింఖణము, నల్లకలువ, తెల్లకలువ, చందనము, రక్తచందనము - ఇవి ఒక్కొక్క తులము గ్రహించి కల్కము చేసి నాలుగుప్రస్థములు ఆవుపాలు, శతావరిరసము నాలుగుప్రస్థములు ఆవునేయి ఒకప్రస్థము—వీటినన్నింటిని గోమయాగ్నిచే ఘృతపక్వముగ కాచవలెను.

గుణము:— స్త్రీలకు వంధ్యాత్వము పోవును స్త్రీపురుషులు దీనిని సేవించిన మగశిశువులే జన్మింతురు.

గమనిక:— పై ద్రవ్యములలో లక్ష్మణా మూలమును (తెల్ల కాయలు గల మునగ చెట్టు వేరు) చేర్పవలెను. మేద, మహా మేదలు, దొరకకపోయినచో పిల్లిగడ్డలు, కాకోలి - క్షీర కాకోలి లేకపోయిన పెన్నేరుగడ్డ ఉపయోగించవచ్చును. కన్యకలు కాక పుత్రులే కలుగుదురని దృఢముగ చెప్పబడినది.

4 అమృతప్రాశఘృతము:—

జీవకము, ఋషభకము, పెగ్గుమ్మడి, మనుబాల, శొంఠి, కచూరం పర్ణినీ చతుష్టయము, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, పెదవాకుడు, చినవాకుడు, గలిజేరు, తెల్లగలిజేరు,

యష్టిమధుకం, దూలగొండి, పిల్లిపీచర, బుద్ధి, చిట్రీత, గంట భారంగి, ద్రాక్షపళ్లు, కేవతిములగ, సింగాణిదుంపలు, నేల ఉసిరిక, పాలగుమ్మడు, పిప్పలి ముత్తవపులగము, రేగు, ఆక్రోటుపండు, ఖర్జూరకాయ, బాదంకాయ, గొలుగుపండ్లు - ఇవి ఒక్కొక్క తులము గ్రహించి కల్కము చేయవలెను ఉసిరిక నేలగుమ్మడుల రసము. పెసరకట్టు, పాలు - ఇవి ఒక్కొక్క ప్రస్థము, నేయి ఒక ప్రస్థము కలిపి ఘృత పక్వముగా కాచి చల్లారినతరువాత అందు తేనె అర్థప్రస్థము, 50 పలాలు పంచదార, ఆకుపత్రి, ఏలకులు, నాగకేసరాలు, దాల్చిన చెక్క, మిరియాలు ఒక్కొక్క తులము చూర్ణము చేసి కలుపవలెను.

గుణము:- నిజముగ ఇది అమృతమువంటిది. వీర్యవృద్ధి, సకల అవయవములకు పుష్టి కలిగించును. అపస్మారము హృద్రోగము, యోనివ్యాధులు, మూత్రవ్యాధులు, శ్వాస కాసలు తగ్గును. పాలలో కలిపి సేవించుట ఉత్తమము.

5. ధాత్రీఫలాదిఘృతము:-

ఉసిరికాయ, నేలగుమ్మడి, చెరకు, జీవనీయగణము, వీనిరస ములు, నెయ్యి, మేకపాలు, ఆవుపాలు - వీటిని ఒక్కొక్క ప్రస్థము గ్రహించి ఘృతపక్వముగ తయారుచేసి చల్లారిన పిదప పంచదార తేనె - వీనిని రెండుప్రస్థములు కలిపి సేవించ వలెను.

గుణము:- రాజయక్ష్మ, అపస్మారము, ధాతుక్షయము పోవును. యౌవనము, ఆయుష్షు, బలము వృద్ధిచేయును.

6. ద్రాక్షాది ఘృతము:-

ద్రాక్షపళ్లు ఒక ప్రస్థము, అతిమధురము 8 పలములు, వీనిని కషాయముగా కాచి అందు 8 పలముల పిప్పళ్ల కల్కమును, ఒక ప్రస్థము ఘృతమును కలిపి తయారుచేసి చల్లారిన పిదప తేనె పంచదార ఎనిమిదేసి పలములు, ఘృతముతో సమానముగ సక్తుపిండిని కలిపి సేవించవలెను.

గుణము:- అత్యుష్ణమును హరించును. నిశ్శక్తత్వము కల వారికి చాలమంచిది. రక్తగుల్మము హరించును.

7. మంజిష్ఠాది ఘృతము:-

మంజిష్ఠాదివేరు, అతిమధురం, నల్లకలువ గడ్డ, చినములక, వెలగపండు, పెదములక, రేణువలు, తిప్పతీగగడ్డ, పెన్నేరు గడ్డ, చేమపాల్ల, ఇంగువ. గ్రంథితగరం, చెంగల్వకోష్టు, పసుపు, తామరతూండ్లు, జిల్లేడుపూవు, గచ్చపూవు, కొబ్బర, అడ్డసరం, నేలగుమ్మడిగడ్డ, కాగిదొండగడ్డ, ఒక్కొక్కటి $\frac{1}{4}$ పలంవంతున వేరు వేరుగ నూరి, ఒకపలంవంతున, రసం పిడుచుకొని కలిబోసి అందుకు సమం ఆవునేయి పోసి ఘృతపక్వముగ తయారుచేయవలెను.

మోతాదు:- రేపు, మాపు పూటకు $\frac{1}{2}$ తులం వంతున ఒక మండలము సేవింపవలెను.

గుణం:- వంధ్యత్వం, మృతవంధ్యత్వం హరింపజేసి పుత్రులనే కలిగించును.

8. సంతాన క్షీరము:—

పెదమురదగొండి వేరును ఆవుపాలతో నూరి కల్కము చేసి త్రాగించవలెను.

9. కపిత్థ క్షీరము:—

వెలగపండు గుజ్జును ఆవుపాలతో నూరి సేవించిన పుత్రులే కల్గుదురట,

10. మృతవంధ్యానివారిణి ఘృతము:—

బిడ్డ చనిపోయిన తరువాత మరల కొందరికి సంతానము కలుగదు. అట్టివారు దీనిని సేవించవలెను.
వెణుతురు వేళ్లరసములో ఆవునేయి కలిపి ఘృతపక్వముగ కాచి పుచ్చుకొనవలెను. పిల్లలు పుట్టిన వెంటనే చనిపోవుచుందురు. అటువంటిస్త్రీలు 7వ మాసమున ఈ ఘృతము సేవించవలెను.

11. కూష్మాండ ఘృతము:—

పెదగుమ్మడి కాయ, నెల్లికాయ, అడ్డసరపాకు, చల్లగడ్డ, నేలగుమ్మడి గడ్డ, చెరకు- వీని రసములు ఒక్కొక్క శేరు. ఆవుపాలు శేరు, ఆవునేయి 1 శేరు, అన్నీ కలిపి కాచవలెను. అందు శొంఠి, పిప్పలి, మిరియాలు, జాజికాయ, తవాక్షురి, విప్పపూలు, వాయువిడంగాలు, జటామాంసి, చెంగల్వకోష్టు, రాతిపూవు, శ్రీగంధం సుగంధపాలు, వట్టివేరు, సదాప, చిట్టాముట్టి వేరు, పెనముట్టి వేరు, నాగమల్లివేరు,— ఇవి

ఒక్కొక్క పాతికపలము పొడిచేసి వేయవలెను ఘృతపక్వ మైన తరువాత దించవలెను.

మోతాదు:- ఒకతులం రెండుపూటల ఒకమండలం సేవించ వలెను.

గుణము - యోనిశూల, లింగశూల, రజోదోషములు, మూత్రాఘాతము, ప్రమేహము, రొమ్మునొప్పి తగ్గును.

12. ఆమలక ఘృతము :-

పెదముత్తవ పులగము, పిల్లిపీచర, కల్కము చేసి కషాయము కాచవలెను. (నూరుసార్లు కాచుట శ్రేష్ఠమట. ఉసిరిక పండ్ల రసమును, గలిజేరు కల్కమును చేర్చి ఒక అడకం నేతితో కాచి తయారుచేయవలెను. (2) పిదప నేలగుమ్ముడు రసమును, పాతకూర కల్కమును జేర్చి మరల కాచవలెను. (3) పిదప నాలుగురెట్ల పాలను, చినముత్తవ పులగమును, పెదముత్తవ పులగమును, కషాయముగ కాచి, పిల్లిపీచర కల్కము చేర్చి మరల కాచవలెను.

ఇట్లు ఒక్కొక్కదానితో వేయిసార్లుగాని నూరు మారులుగాని కాచవలెను. తరువాత ఆ ఘృతమునకు నాలుగవ వంతు పంచదారను, తేనెను కలిపి బంగారము లేక వెండి పాత్రయందుగాని, శుభ్రమైన నేతితో మాగిన మట్టి పాత్రయందుగాని పోసి యుంచవలెను.

గుణము- దీనిని మూడు సంవత్సరములు సేవించిన నూరు వత్సరముల ఆయుర్దాయము కలుగును. ఏక సంతగ్రాహి

యగును. ధారణశక్తియు పెరుగును. సకల వ్యాధులు శమిం
చును. చక్కని కంఠస్వరము, శరీరకాంతి కలుగును. ఇది
సప్తధాతురసాయనమని ప్రశంసింపబడినది.

**13.** సంతాన కళ్యాణఘృతము :-

పెదపావర, కరక, ఉసిరిక, తాడి, మామిడివప్పు, దేవదారు,
కూతురుబుడమ, ముయ్యాకుపొన్న, దురదగొంకి విత్తులు,
కూరవసుపు, మానిపసుపు, సుగంధిపాల వేరు, తెల్లతెగడ
వేరు, నల్లకలువగడ్డ, ఏలకులు, మంజిష్ఠవేరు, దానిమ్మచిగుళ్ళు,
వాయువిడంగాలు, పిల్లిపీచర, చెంగల్వకోష్టు శ్రీగంధము,
తాళిసపత్రి, లవంగపత్రి, పెదములక, చినములక, జాజిపూవు
ఒక్కొక్కటి పాతికపలము నీటితో నూరి వడగట్టి అందు
అర్ధ శేరు పంచదార, అర్ధ శేరు ఆవునేయి, ౪ పలముల తేనె
కలిపి ఘృతపక్వముగ కాచవలెను.

గుణము- అపస్మారము, శ్వాసకాసలు, క్షయ, వింశతి మేహ
ములు తగ్గును. వంధ్యత్వమును పోగొట్టును.

# కొన్ని వ్యాధులు - చికిత్సలు

## 1. స్థూల హరములు

(అ) చవ్యాదిచూర్ణము - చవ్యము, జీలకర్ర, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇంగువ, సౌవర్చ లవణము, చిత్రమూలము సమభాగములు. వీనిని చూర్ణించి తేనెతో రెండు పూటల తీసికొనిన లావు తగ్గును.

(ఆ) గుడూచ్యాది చూర్ణము - తిప్పతీగె, కరక్కాయ, తుంగముస్తలు సమభాగాలుగ చూర్ణించి దానికి సమముగ లోహభస్మము కలిపి తేనెతో సేవించినను స్థౌల్యము హరించును.

(ఇ) తామ్రభస్మము, పిప్పళ్ళు వీనిని సమభాగములుగ నూరి తేనెతో తీసికొనిసను మంచిదే.

(ఈ) జయంత్యాది చూర్ణము - కొడిశపాల, ఉసిరిక పప్పు. తక్కలి, కరక్కాయ వీనిని సమభాగములుగ దంచి చూర్ణించి నీటితో సేవించినను లావు తగ్గును.

(ఉ) త్రికటుకాది చూర్ణము - శొంఠి, పిప్పలి, మిరియాలు కటుకరోహిణి, కారుమునగ, చినములక, పెదములక, కోల పొన్న, నక్కతోకపొన్న, నేలతాడిగడ్డలు, సౌవర్చలవణము. పసుపు, మానిపసుపు, ఆటివస, ఇంగువ, కొడిశపాల, జీలకర్ర,

వాయువిడంగం, బోడతరం, కొతిమెర్లు - సమభాగాలుగ దంచి సమముగ లోహాభస్మము కలిపి తేనెతో సేవించ వలెను.

పథ్యములు- ఆహారం - జొన్న, యవ, ఉలవ. పేలాలు, శనగ, పెసలు, కందులు, తేనె, చేదు, ఒగరు కల పదార్థములు, మజ్జిగ, ఆకుకూరలు, ఉష్ణోదకము.

అపథ్యములు- గోధుమ, పాలు, పగటినిద్ర, వాతకర పదార్థ సేవనము.

## 2. కృశత్వ హరములు

(అ) నేలతాడిగడ్డ, పెన్నేరుగడ్డ, సమభాగాలుగ చూర్ణించి పూటకు పావుతులము పాలు, నేయి, పంచదారలతో సేవింపవలెను.

(ఆ) పిడికెడు విష్ణుకాంతపు వేరును పావుశేరు ఆవు పాలతో నూరి కొలదిగ సిందూరం కలిపి సేవింపవచ్చును.

(ఇ) బ్రహ్మదండి వేరును ఆవుపాలతో నూరి సిందూరము కలిపి సేవించిన కృశత్వము పోవును. బలము కలుగును.

(ఈ) భూతాంకుశపు వేరును నల్ల ఆవు పంచితములో నూరి ప్రతిదినము శరీరమునకు లేపనము చేసిన కృశత్వముపోయి కండపుష్టి కలుగును. మాంసాహారులు మేక మాంసము తినుచుండుట మంచిది.

(ఉ) అశ్వగంధి లేహ్యము గాని చ్యవనప్రాస గాని ద్రాక్షారిష్టతో ఒక సంవత్సరము సేవించిన మంచి కండ

పుష్టి కలుగును. చ్యవనప్రాసలో మనిషిని ఎదిగించు శక్తియు కలదు. ఇది గమనీయము.

## 3. దంతవ్యాధులు

1. దంతధావన చూర్ణము:-

ఒక తులం చలువ మిరియాలు, ఒక తులం పలుకు సాంబ్రాణి, ఒక తులం సైంధవ లవణము, మూడు తులాలు పొంగించిన పటిక - వీటిని వస్త్రకాళితం చేసి వాడుకొనవలెను. (పళ్లు తోముకొనవలెను).

2. జీరగ చూర్ణము :-

చినపిప్పలి, సైంధవలవణము, జీలకర్ర - సమభాగాలుగ చేసి మెత్తగ చూర్ణించి వాడుకొనవలెను.

3. నింబాది చూర్ణము :-

వేపచెక్క పొడి, తుమ్మచెక్క పొడి, కరక్కాయ బెరడు (వేయించినది) - ఇవి సమభాగాలు, సైంధవలవణము సగభాగము మెత్తగ పొడి చేసి వాడుకొనవలెను.

4. తేజోహ్వాది చూర్ణము :-

పెద్దజ్యోతిష్మతి, కరక్కాయ, ఏలకులు, మంజిష్ఠ, కటుక రోహిణి, తుంగ గడ్డలు, చిరుబొద్ది జ్యోతిష్మతి, లొద్దుగ, మాన్రిపసుపు, చెంగల్వకోష్టు, సమభాగాలు చేసి మెత్తగనూరి ప్రతిదినము దంతధావనము చేయవలెను.

గుణము- రక్తస్రావము, దుర్వాసన పోవును, చిగురువాచుట, నోటిపూత కలుగవు.

## 4, గర్భనిరోధకములు

1. పిప్పలి, వాయువిడంగం, పొంగించిన వెలిగారం సమ భాగాలు చూర్ణించి ఋతుసమయమున పాలతో కలిపి త్రాగునది.

¼ తులం చూర్ణం ఒక మోతాదు వంతున రోజుకు మూడుసార్లు బియ్యపు కడుగులో లేక పాలతో కలిపి ఆ మూడు దినములు త్రాగవలయును.

2. ఋతుకాలమున దాసానిపూలను కాంజికముతో నూరి, కల్కం చేసి త్రాగి పాతబెల్లం ఒక పలం భుజింప వలెను, During the menses.

3. ఋతుకాలమయిన నాల్గవదినమున తాళిసపత్రి చూర్ణం 1 తులం కావిరాయి చూర్ణం 1 తులం గ్రహించి కర్ష ప్రమాణం నీటిలో కలిపి త్రాగవలెను.

4. చక్రికేళ్ళను బియ్యపు నీటి కడుగుతో నూరి కల్కం చేసి ఋతస్నాతయగు స్త్రీ ఆ మూడు దినములు త్రాగవలెను.

5. పొంగించిన వెలిగారము, దాల్చినచెక్క చూర్ణము సమభాగాలు కలిపి పూటకు బేడ వంతున వేడి నీళ్ళతో స్త్రీ ఋతువు కాకముందునుండి యిచ్చుచుండిన ఋతువు జారీ అయిపోవును.

6. ఉదయమున ఒక లవంగం మ్రింగుచుండవలెను.

7. జాజి మల్లె వేరు, పంచక పుష్పపు రేకులు సమ భాగాలుగ నూరి ఎండనిచ్చి బహిష్టుకాలమందు తిని గ్రుక్కెడు నీరు త్రాగవలెను.

8. పిప్పళ్ళపు చెక్క బెల్లంతో మరగబెట్టి త్రాగవలెను.

9. నల్లజీలకర్ర వాయువిడంగాలు, నాగకేసరములు, పెద్దకర్జూరాలు, కాయఫలము, ప్రతిదినము అయిదుగ్రాములు మెత్తగనూరి మాత్రలు చేసి బహిష్టు కాలమున ఏడు రోజులు తినవలెను.

10. జాజి, మల్లెమొగ్గ, ఒకటి మ్రింగిన ఒక సంవత్సరము గర్భంరాదు.

11. ఆముదపు పప్పు ఒకటి మ్రింగిన ఒక సంవత్సరము, రెండు మ్రింగిన రెండు సంవత్సరములు గర్భంరాదు.

12. విభీతక (తాండ్రికాయ) కషాయం ఋతుమతియగు స్త్రీ స్నానం పిదప 7 దినాలు రెండుమార్లు స్వీకరించవలెను. తాండ్రికాయచూర్ణము బియ్యపుకడుగుతో ఋతుకాలము నుండి ఒకవారము వాడవలెను.

13. పాతబెల్లం పానకం ఋతుమతి అయినది మొదలు 17 దినములు త్రాగేది.

14. మూడేండ్ల పాతబెల్లం ఒక పలం 15 దినాలు తిన వలయును. పాత బెల్లం దొరకనిచో 12 గంటలు బాగా ఎండిన బెల్లం వాడునది.

## 5. మసూచికము : (అమ్మవారు) SMALL POX

1. దవన కషాయము :

దవనం నీడను ఆరించి చూర్ణించి ఒక తులం పొడికి పావుశేరు నీళ్ళు పోసి పాతిక వంతు మిగులునట్లు కషాయం కాచి కొంచెం చక్కెర కలిపి త్రాగవలయును.

గుణము: మసూచికలు, ఆటలమ్మ, వాని పొంగులు గాని లేవవు.

2. నింబకషాయం:

వేప ఈనెలు, చింత ఈనెలు నల్లి ఈనెలు బంగారు చాయగా వేయించి ఓమం, వాయువిడంగం నలియగొట్టి కషాయం కాచి ఇవ్వవలెను.

గుణము : మలబద్ధకము పోవును.

3. పల్లేరాకు రసం చక్కెరలో వేసి త్రాగవలయును. మసూచికలు మానును.

4. నీరు పిప్పలి, నల్లికాయల రసంతో నూరి త్రాగునది. మసూచికలు మానును.

5. నేలతాడి నూవుపిండితో తినవలయును. మసూచికలు మానును.

6. చేదుపొట్ల కషాయం:

చేదుపొట్ల, కటుకరోహిణి, అడ్డసరపాకు, వేపచెక్క, తుంగగడ్డ, వర్పాటకము, దురదగొండి వేళ్ళు, సీమనేలివేము, వలియగొట్టి వీనిని కషాయం కాచి పుచ్చుకొనలయును.

గుణము: పక్వముగాని మసూచిరోగములు, మసూరి భేదములు మానును.

7. మునగాకురసం నేతితో కలిపి మసూరికలకు పట్టించవలయును.

వరా : మసూచి చూచుటకు భయంకర వ్యాధి. చికిత్సకు సులభమైనది.

తీసుకోవలసిన జాగ్రత్తలు:-

1. కళ్ళలోను మసూరికలు (కురుపులు) కలుగును. అటు వంటి సమయమున కంటిలో 2, 3 ఆముదపు బొట్లు దినము నకు ఒకమారు వేయుచుండవలయును.

2 కురుపులు తేలకున్న పప్పు పదార్థములను (మైసూర్ పాక్, పెసర, శనగ, మినుము కలసిన వడలవంటివి) బాగుగ తినిపించవలయును.

3 కురుపులు చితుకుట ప్రారంభమైనది మొదలు పత్యము చేయవలయును. అంతవరకు అన్నియు తినవచ్చును.

4. కురుపు చితికిన తరువాత చీమల బాధ అధికమగును. రోగి మంచము చుట్టుగ మేక్సిన్ వంటివి చల్లవలయును.

5. ఎంత దురద యెక్కినను రోగి గోకకూడదు. గోకిన గంట్లుపడి అసహ్యముగ తయారగును.

6. రోగి వస్త్రములను క్రిమిహారక పదార్థములతో శుభ్రము చేయవలయును. కురుపు చితికి పక్కుకట్టి ఊడును. ఆ పక్కులను గోతిలోవేసి పూడ్చుచుండవలయును. గదిని ఫినాయిల్ తో కడుగుచుండవలయును.

## 6. కలరా

కలరా మిగుల క్రూరమైన వ్యాధి. అతివేగముగ వ్యాపించును. మసూచిలో రెండు మూడు దినాల తరువాత వైద్యము ప్రారంభిచినను విషమించదు. ఆలస్యం అమృతం విషం అనునది కలరా రోగమునకు బాగుగ వర్తించును. దీనిని Water borne disease అందురు. అనగా నీటిగుండా

ఒకరి నుండి మరియొకరికి వ్యాపించును. కనుక కలరారోగి వెం బడి కూర్చునుటకును, వానికి తగిన ఉపచారములు చేయుట కును భయపడనక్కర లేదు. కలరాలో రోగికి చిట్టుడుకు నీరు తప్ప ఇంకొక ఆహారం పనికి రాదు. ఇది తప్పక గమనించ వలసిన విషయము.

PREVENTIVE :

వసచూర్ణము చక్కెర పాకంలో వేసి బిళ్ళలు చేసి తినుచుండిన కలరా రాదు.

చికిత్స -- 1. అమృత బిందు --పెప్పరమెంట్ క్రిస్టల్స్, వాము ఉప్పు, (థైమూల్), ముద్ద కర్పూరము-- సమభాగాలు. ఒక సీసాలో పోసిన కొన్ని నిముషాలకు నీరగును దీనిని మూడు చుక్కలను ఒకఔన్సు చన్నీటిలో పోసి రోగ తీవ్రతను బట్టి పలుమారు ఈయ వచ్చును.

2. కర్పూరాద్యరిష్ట వాడవచ్చును.

3. కస్తూరి కల్పరసాయనము వాడవచ్చును.

4. కేవలచిన్ని బ్రాందీలో అరగతీసి బొడ్డుచుట్టు పట్టించుట మంచిది.

నా ప్రత్యేక అనుభవము:—

తోకతిప్ప అగ్రహారమున మాబంధువుల ఇంట జరుగు పెండ్లికి వెళ్ళితిని. ఆఊరిలో ఆసుపత్రిగాని వైద్యుడుగాని లేదు. యజమాని అల్లునికి కలరా తగిలినది. పొత్తికడుపు చుట్టూ తడి గుడ్డ, తడి ఆరకుండ దానిపై ఉలన్ గుడ్డ కట్టించితిని. ఆవిరి స్నానము చేయించితిని. బాగా చెమట పట్టిన తరువాత శరీర

మంతా తడిగుడ్డతో తుడిచి వేడి వచ్చువరకు దుప్పటికప్పి పరుండబెట్టితిని. మూత్రబంధము కలిగినది. దోసవిత్తుల కషాయము (దోసవిత్తులు, చీపురుముళ్ళు, పల్లేరుకాయలు, సూరేకారం ఉప్పు,) రెండు మూడు మారులు త్రాగించితిని. వెంటనే మూత్రం జారీ అయినది. రోగం పూర్తిగ నయమైనది.

హెచ్చరిక : రోగికి వెచ్చని దుస్తులు ఎప్పటికప్పుడు మార్చుచుండవలెను. చలిగాలి తగులనీయరాదు. రోగి మలమూత్రములు దూరంగా గుంట త్రవ్వి అందువేసి పైన కొంచెము మట్టి వేయుచుండవలయును. ఇంటి చుట్టుప్రక్కల శుభ్రముగా ఉంచవలెను. ఇంటిలోనివారు ఒక పూట భోజనము చేయుట మంచిది వాంతులు. విరేచనములు తగ్గి ఆకలి అగువరకు ఏవిధమైన ఆహారమివ్వరాదు. ఉపవాసములు చేయింపమని ప్రకృతి వైద్యులు శ్రీ వేగిరాజు కృష్ణంరాజుగారు వ్రాసినారు.

## 7. తేలుకాటు

తేలుకాటునకు అనేక చికిత్సలున్నవి. కాని నా అనుభవమును కొంత ముందుగ చెప్పెదను.

తేలు కుట్టినవెంటనే బెల్లము నీళ్ళలో కలిపి పానకం చేసి ఒక లోటా (10 ఔన్సులు) త్రాగించిన విషము చాలా భాగము వెంటనే హరించును. ఆ పైన అమృతాంజనము గాని వాజలైన్‌లో 4, 5 బొట్లు అమృతబిందు బాగుగా కలిపి గాని కుట్టినచోట బాగుగా వ్రాసిన విషము మాయమై

పోవును. మరియు కుట్టిన భాగమును వేడినీటియందో చన్నీటి యందో ఉంచినచో మంట తగ్గిపోవును. కొందరికి వేడినీరు, కొందరికి చన్నీరు పడవు. వారి వారి తత్వానుసారము ఎవరికి ఏది హాయిని కలిగించిన వారు ఆ నీటిని ఉపయోగించ వలయును.

కుట్టిన భాగముపై ఎత్తునుండి ధారగా నీరు పడునట్లు చేసిన (కుళాయి ఉపయోగించిగాని లేక బిందెతో పోసిగాని) నొప్పి శమించును.

కొద్దిగ ఆవిరి స్నానము చేయించి, వెంటనే 5 లేక 10 నిమిషములు కటిస్నానముగాని, లేక లింగస్నానముగాని చేయించిన విషము హరించును. దేహమునకంతయు ఆవిరి స్నానము చేయించలేనివారు, కుట్టిన భాగమునకు క్రింద, పైన, ఆవిరి తగులునట్లుచేసి తరువాత తడిగుడ్డతో తుడిచినను మంచిది. కటిస్నానమునకు, లింగస్నానమునకు సదుపాయము లేనివారు పొత్తికడుపు చుట్టును తడిగుడ్డ చుట్టి తడి ఆరిపోకుండ ఆపైన ఉన్ని గుడ్డచుట్టి, 15 నిమిషములు ఉంచవలయును.

గమనింప వలసిన విషయము:—

ఒకరాత్రి భోజనానంతరము చేయికడుగు కొనపోయి నపుడు తేలు కుట్టినది. 18 ఏండ్ల దృఢకాయుడైన ఆబాలుడు గడగడ వణకుచుండెను. బాధ ఎక్కువగా నుండెను. ఆదిన ములలో చాలా పేరుపొందిన మందు 'తిర్యక్' తెప్పించి వాడి నను లాభము లేకపోయెను. ప్రసిద్ధిగాంచిన మాంత్రికుని పిలిపిం

చితిమి. ఆయన ప్రయత్నించి సాధ్యము కాక వెడలిపోయెను. అంతట ఆవిరి స్నానము, కటి స్నానము చేయించి వెచ్చని గుడ్డలు కప్పి పరుండ బెట్టితిమి. సుఖముగ నిద్రించెను. ఆ తేలు లక్షణములు జేయొకటిః-- లింగము కొయ్య బారినట్లాయెను. అల్పాచమానమునకు పోవలసినట్లుండెను. కాని మూత్రము కాక గుక్లము వెడలుచుండెను ఇంత భయంకరమైన విపత్తు ఎట్లో దైవానుగ్రహమున తప్పిపోయినది.

మరునాడు ఆయుర్వేదకళాశాలకేగి, రాత్రి అనుభవము చెప్పగా, ఉపాధ్యాయుడు ఆ తేలు ఉచ్చటంగమను జాతికి చెందినది అనియు, దానికి స్వేదము తప్ప మరియొక చికిత్స లేదనియు చెప్పెను.

నేనొక పెండ్లికి పోగా, ఎదురింటి 35 ఏండ్ల స్త్రీకి తేలుకుట్టి, స్మారకము లేక పడిపోయెను. వారు ఆమెను చికిత్సాలయమునకు తీసుకొనిపోవు ప్రయత్నమునందుండిరి.

అపుడు నేను ఒకగ్లాసుడు బెల్లపుపానకము త్రాగించితిని. వెంటనే ఆమెకు స్మృతివచ్చినది. బాగుగ నెమ్మదించినది.

తేలుకాటుకు మరికొన్ని చికిత్సలు.

1. అమృతబిందు 3 చుక్కలు 1 ఔన్సు నీటియందు కలిపి త్రాగించిన విషము దిగిపోవును.

2. సప్తానంద భైరవి గాని శీతాంశురసం గాని ఒకమాత్ర మింగించి, ఒకమాత్ర జిల్లేడుపాలలో అరగదీసిపట్టించ వలయును.

3. ఎడమభాగమునందు కుట్టిన కుడి కంటియందు, కుడి భాగమునందు కుట్టిన ఎడమ కంటిలోను ఉప్పు నీటిలో కలిపి నాలుగు చుక్కలు వేయుదురు. ఇది ఇంగ్లీషు వైద్యులు కూడా చేయు చికిత్స.

4. కుట్టినచోట ఉల్లిపాయలు నూరి పట్టించి బెల్లం తినిపించవలయును,

5. వేడి నీటియందు ఎక్కువ ఉప్పు కలిపి కుట్టిన ప్రదేశమును కడుగవలెను,

6. నిమ్మకాయ రసం రాయవలయును.

7. ముల్లంగి ఉప్పులో కలిపి కట్టవలయును.

8. గడ్డిపరకలు నూరి నేయి వేసి కలిపి పట్టించవలయును.

9. హారతి కర్పూరం 'కవిరి'లో పిలిపి రాయవలయును.

10. ధనియాల రసం కవిరిలో కలిపి రాయవలయును.

11. తుంగదుంపలు తినుట, నూరి రాయుట.

12. ఉత్తరేణి ఆకు రసం గాని బొప్పాయి పాలు గాని దొండ ఆకు రసం గాని తేలు కుట్టినచోట మర్దనచేయవలెను.

13. దుంపనాభి లేక వసనాభి గంధం పూయవలెను.

14. జీలకర్ర, తేనె, ఉప్పు, నేయి, కలిపి నూరి కట్టుకట్టిన విషము హరించును. (వస్తుగుణదీపిక).

15. మోదుగ విత్తులు, హరిదళము, నవాసారము - ఈ మూడింటిని తెల్ల జిల్లేడు పాలతో నూరి, కణికలు చేసి చన్నీటితో అరగదీసి పూయవలెను,

16. నీరుల్లి గడ్డలు తురిమి, ఉప్పు వేసి కట్టవలె.

(17, 18– ఆర్థరీయము)

గమనిక: ముల్లంగి తేలుపై పెట్టిన తేలు చచ్చి పోవును. తేలును కాల్చినచో చుట్టుప్రక్కల ఉండు తేళ్లు పారిపోవును.

## 8. క్షయ

చరకాది మునులు ఈ వ్యాధికి కారణము ఒక్క మాటలో "అతి" అన్నారు. అనగా మన ఆహారవిహారము లలో మితిమీరి ప్రవర్తించుట. అధికముగ తినుట, తిన కుండుట (ఉపవాసాలు), వేగముగ నడచుట, ఈదుట, చదువుట, ఇంటిపనులు – నీళ్ళుతోడుట, పిండి వగైరా రుబ్బుట – ఇట్టివి శక్తికి మించి చేయుట, అమిత సంభోగము – ఈ అన్నిటిలోను అమితత్వము క్షయ రోగమునకు ప్రధాన కారణము.

ఇవిగాక మనోవ్యాపారమువలనను క్షయ సంభవింప వచ్చును. తన కోరికలు విఫలమగుట, ఆస్తి నష్టము, కుటుంబకలతలు, అసూయ – వీని వలనను క్షయ వ్యాధి గావచ్చును.

చికిత్స – మొదటి యోగము – పైన చెప్పినవి లేకుండ చేసి కొని అన్నిట శాంత చిత్తము కలిగియుండుట. రెండవ యోగము గీతాభాగవత శ్లోక పద్యములను సతతము జ్ఞప్తి యందుంచుకొనుట.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥

(2) యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా॥ గీత

"వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తంబును లేశమైన
పదివేలనుచున్ తృప్తిం బొందని మనుజుడు
సప్త ద్వీపమునైన చక్కంబడునే"

**మందులు :**

**క్షయ కుఠారము** – వెన్న, చక్కెర, తేనె బంగారువర్కుతో (బంగారు ఆకులు – రేకులు) కలిపి సేవించవలెను. మిగుల శ్రేష్ఠమైన ఔషధము. (ఆర్ధరీయము) దీనిని గూర్చి గ్రంథకర్త ఇట్లు వ్రాసెను.

"దీనిని సేవించితివా! క్షయవ్యాధి పోవును. నేను శివునాజ్ఞ తప్పినట్లు అని శపథం చేస్తున్నాను. పిత్తక్షయకు మిగుల మేలుచేయును".

ఇతర ఔషధములు –

చ్యవనప్రాస, ద్రాక్షారిష్ట సేవించవలెను. చ్యవనప్రాసలో మకరధ్వజగాని స్వర్ణాభ్రక సిందూరముగాని కలిపి తీసికొనిన అత్యుత్తమము. మహాకనకసిందూరము జగత్ప్రసిద్ధౌషధము. అశ్వగంధిలేహ్యమున మహాలక్ష్మీవిలాసరసముగాని పూర్ణ చంద్రోదయముగాని కలిపి సేవింపవచ్చును. దగ్గు హెచ్చుగానున్న వాసారిష్ట త్రాగవలెను. జ్వరము తగ్గకున్న దివ్యౌషధమగు స్వర్ణమాలినీ వసంతరసము వాడవలెను. ఎటువంటి పరిస్థితిలోను తప్పక జ్వరము తగ్గితీరును.

క్షయవ్యాధి ప్రాథమిక దశయందు సులభసాధ్యము, మధ్యమ స్థితిలో కష్ట సాధ్యము. చరమావస్థలో అసాధ్యమే.

క్షయవ్యాధి అంటువ్యాధికాదు. (ఈవిషయమున మతభేదము లున్నవి).

## 9. కడుపునొప్పి

1. నేలతాడి చూర్ణము వేడి నీళ్లతో త్రాగించిన దారుణ మైన కడుపునొప్పి తగ్గును.

2. తురకవేప పట్ట రసం 1 ఔన్సు త్రాగినను తగ్గును.

3. పొత్తికడుపు చుట్టు తడిగుడ్డ కట్టి దానిపై తడి ఆర కుండునట్లు ఉలెన్ గుడ్డ కట్టవలెను. అతి శీఘ్రముగ గుణ మిచ్చును. ముట్టుకుట్టునొప్పికూడా తగ్గును.

N. B – ఈ వైద్యము లెక్కలేనంత మందికి చేసితిని. తగ్గని వారు ఒక్కరును లేరు గుడ్డ కట్టిన 5, 6 నిమిషా లలో నిద్ర వచ్చును. నిద్రలో కడుపునొప్పి మాయ మగును.

4 అజీర్ణమువలన వచ్చిన కడుపునొప్పికి ఆయుర్వేద వైద్యులు సాధారణముగా మహాశంఖవటి, శంఖభస్మము, స్వర్ణక్రవ్యాది, కాశీసం, వాడుచుందురు. శౌంఠిరసం మంచిదే.

సుఖవ్యాధులు జీర్ణమైన వారిలో కొందరికి కడుపునొప్పి సంభవించును. అట్టివారికి పైమందులు పనిచెయ్యవు. సిఫిలి టిక్ పాయిజన్ విరుగకొట్టుటకు మందులిచ్చిన కడుపునొప్పి తగ్గును. ఒక దివ్యమైన సాటిలేని మందును వ్రాయుదును. 1 గ్రాము మౌక్తికభస్మము, 5 ఉత్తరేణి దళములు కలిపి మెత్తగ నూరి 6 మాత్రలు చేసి మూడురోజులు వాడవలెను ఒక మాత్రకే కడుపునొప్పి తగ్గును మిగిలినవికూడా వాడిన జన్మలో మరల రాదు. సందేహము లేదు.

## 10. శిరశ్శూల

1. తురక వేపాకు గాని పూలు గాని దంచి తలకు కట్టవలెను. తలనొప్పి తగ్గును. (అనేకులకు వాడితిని శీఘ్ర గుణమిచ్చినది) అది దొరకక పోయిన మామూలు వేపాకు అయినను పనిచేయును.

2. పగడపూలు తలకు కట్టవలెను.

3. ఎండిన పగడపూలను చూర్ణించి నశ్యము చేయవలెను. నిత్యము ముక్కువెంట నీరుకారుటయు తగ్గును.

జీర్ణించిన తలనొప్పులకు కొన్నియోగములు:—

1. చంద్రావర్తిరసము —రెట్టింపు తిప్పసత్తుచేర్చి మాదీఫలముతో సేవింపవలెను. (ఎన్ని సంవత్సరములనుండి ఉన్న అన్నిమండలములు విడువకుండ వాడవలెను.)

2 స్వర్ణసూర్యావర్తి వేయించిన జీలకర్ర తిప్పసత్తు ఇవి మెత్తగ నూరి మాదీఫలంతో సేవించాలి. తగ్గకపోయిన, ప్రాత ధాన్యమును పేలాలుగ చేసి దానిని పిండిచేసి స్వర్ణసూర్యావర్తిలో కలిపి మాదీఫలంతో సేవించిన చిరకాలపు తలనొప్పులు తప్పక శమించి తీరును.

## 11. వెర్రికుక్క కాటునకు చికిత్స

1. ఒక తులం నక్కెరాకులు, 15 మిరియములు నూరి రసంతీసి వడకట్టి త్రాగవలయును.

2. చెంగల్వకోష్టు మూడు తులములు మెత్తగా నూరి ఒక గ్లాసు నీళ్ళలో మరగనిచ్చి, బాగుగా ఇగురనిచ్చి 1 తులం మిగిలియుండగా దింపి వడబోసి త్రాగవలయును.

3. ముషిణిగింజలు మూత్రములో మరగనిచ్చి నూరి రాయవలయును. లేక సారాలో గింజలు మరగనిచ్చి, తొక్కతీసి ఒక రతి రోజు తినవలయును. లేక నీళ్లలో మరగనిచ్చి కొంచెము చక్కెర కలిపి తినవలయును.

4. దాక్షకర్ర కాల్చి బూడిద చేసి 'కవిరి'లో కలిపి గాయముపై పూయవలయును.

5. ముల్లంగి గింజలు చూర్ణము చేసి గాయముపై కట్టవలయును.

6. జిల్లేడుపాలు గాయముపై అంటించవలయును.

7. నల్లజీలకఱ్ఱ కషాయం త్రాగుట మంచిది.

8. నల్లజీలకఱ్ఱ రెండు తులాలు నీళ్లలో కలిపి మూడు రోజులు త్రాగవలయును

9 వావిలాకు గాయముపై కట్టవలయును.

10 కరచిన కుక్క వెంట్రుకలు కాల్చి గాయముపై అంటించవలయును.

నేడు పిచ్చికుక్క కాటుకు విరుగుడుగా ఇంజక్షను యిచ్చుట సర్వసాధారణమైనది కదా!

కుక్క కఱచిన వెంటనే కాకరాకు దంచి, కరచిన చోటు ఉంచి, దానిపై దాగినాణెం ఉంచి కట్టవలయును. విషము హరించును. కానీ పూర్తిగా దీనినే నమ్ముకొని యుండుట మంచిది కాదు.

కఱచినవెంటనే ఆవిరిస్నానము, వెంటనే కటిస్నానము చేయుంచుట మంచిది. నొప్పి పూర్తిగా తగ్గువరకు కుట్టినచోట ఆవిరి పట్టవలయును. ఎంత కొంచెము నొప్పియున్నను విషము నిలచినటులనే భావించవలెను.

కొన్ని సమయములందు, విషము పూర్తిగా హరించినదను అభిప్రాయము కలుగును. కానీ, 4, 5 నెలల తరువాత జ్వరము వచ్చి, వెంటనే 'హైడ్రోఫోబియా' కనిపించును. కనుక అన్ని విధముల జాగరూకులై యుండవలయును.

## 12. గర్భస్రావమునకు

1. పటిక ½తులము, వెల్లుల్లి ½తులము, గంగసిందూరము ఒక తులము, దానిమ్మవేరు 1½ తులము కల్వమున వేసి మెత్తగా నూరి నీటితో త్రాగిన గర్భస్రావమగును.

2 వెర్రిపుచ్చవేరును యోనియందుంచిన గర్భస్రావమగును. వయస్సు వచ్చియు రజస్వలకాని వారికిని ఇది మంచి ఔషధము.

3. మగతాటి చెట్టునపుట్టిన మోగునొక్కటి కొట్టి మేక పాలతో మూడు దినాలు త్రాగిన గర్భపతనమగును.

4. సదాపాకు లేక వెదురాకు నువ్వులు దంచి కషాయం కాచి త్రాగిన గర్భము పోవును. (రెండు నెలలు దాటిన ఇది పని చెయ్యదు.)

5. నువ్వులు బెల్లం కలిపి చిమ్మిలి చేసి 9 పూటలు తినినను, రెండునెలలలోపు గర్భము పోవును.

6 చిత్రమూలమును వావిలాకు రసంతో నూరి 1తులం ముద్దను తేనెతో కలిపితినిన 4 నెలల గర్భమైనను పోవును.

### 13 గర్భపతనము మానుటకు

1. యవలు, నూవులు, శర్కర సమభాగాలు చేసి మొదటి రెంటిని మెత్తగ చూర్ణము చేసి తేనెతో పుచ్చుకొనవలెను,

### 14 యోని శూలలు

1. బిడాల లవణము, బావంచవిత్తులు, అడ్డసరపు వేళ్ళు పిప్పలి, వస, మోడి, శొంఠి – సమభాగములుగ తీసికొని దంచి కల్కము చేసి వేడి నీటితో తీసికొనవలెను.

2 శొంఠి, ఆముదపువేరు – వీని గంధమును యోనికి లేపనము చేసిన యోని శూలలు మానును.

3 వేపాకు రసముతో వేపగింజలను, ఆముదపు పూవును నూరి ముద్దచేసి దానిని యోనియందుంచిన యోనిశూల, దురద తగ్గును. ఈ విధముగ చేసిన కొందరికి అధిక స్రావము కలుగును అది తగ్గుటకు నేతిని కలుపుకొనవలెను. దానికి తగ్గకపోయిన బియ్యపు కడుగును 4 ఔన్సులు త్రాగవలెను బియ్యపుకడుగు అకాల స్రావమును తగ్గింపగలదు.

### 15, సుఖప్రసవమునకు

1. తేనె, నేయి, యష్టిమధుకము, (అతిమధురము) మాతులంగపువేరు – వీటిని సమభాగములుగ స్వీకరించి కల్వములోనూరి నీడలో ఎండించి మాత్రలు చేసి ఉదయము

సాయంకాలము పుచ్చుకొనవలెను (పదిరోజులముందరనుండి పుచ్చుకొనుట మంచిది.)

2. అడ్డసరపు వేరు అరుగతీసి ఆ గంధమును స్త్రీ నాభి యందుగాని యోనియందుగాని లేపనము చేసిన శీఘ్రముగ సుఖప్రసవమగును.

3. ఆకుపత్రి=లవంగపత్రి చూర్ణము లేక కషాయము సేవించిన శీఘ్రప్రసవమగును.

4 కొత్తిమేర మొక్కలు ప్రసవించు స్త్రీ దగ్గరనుంచిన సుఖ ప్రసవమగును. ప్రసవించిన తరువాత ఆ మొక్కలను దూరముగ పారవేయవలెను.

## 16. రక్తార్శస్సు

మొలల వ్యాధి నాలుగు విధములు అందు రక్తార్శస్సు మిగుల బాధను కలిగించునది దీనికి సూరణ మాత్రలు, బిల్వాది లేహ్యము అభయారిష్ట మొదలగు మందులున్నవి రక్తస్రావము వెంటనే తగ్గుటకు కొన్ని యోగములను ఉదహరింతును.

1 పెరుగుతోటకూర సమూలముగ తెచ్చి శుభ్రము చేసి కషాయముగ కాచి త్రాగవలెను

2. ఆవు నేతిలో రెండు గురుగింజలెత్తు మొమ్మాయి వేసి సేవింపవలెను. (వారానికి ఒక్కసారి చాలు)

3 గుహ్యప్రదేశమందు పంచదారతో కూడిన నేతిని పూసి చల్లని జలమును ధారగా పోసిన రక్తస్రావము నాపుచేయును.

4. శ్వేత అరటాకులను, చల్లని నీటిచే తడపిన తామరాకులను, తామరపుష్పముల రేకులను, నల్లకలువ రేకులను తరచుగ ఆ భాగమున ఉంచిన (అదిమి పట్టవలెను) రక్తస్రావ మాగును.

౫. నువ్వులను నూరి అందు ఆవు వెన్న కలిపి పుచ్చుకొన్నను, లేక నాగకేసరములను నూరి అందు వెన్న, పంచదార కలిపి పుచ్చుకొన్నను రక్తార్శస్సు పూర్తిగా మానును.

ఆ సమయమున తినదగినవి:— మజ్జిగతో తయారు చేసిన నీరుల్లి కూర, రేగుపండ్లతో తయారయిన బచ్చలి కూర, పుల్లమజ్జిగతో తయారుచేయబడిన చిరుశెనగల పప్పు, వెన్న, పెరుగుమీది మీగడ, పంచదార, మజ్జిగ.

## 17. మధుమేహము

వింశతి మేహములు ప్రసిద్ధములు. అందు మధుమేహము ప్రమాదకరమైనది మధుమేహలక్షణము _ మూత్రము తేనెవలె వెడలుట, చీమలు, ఈగలు మూత్రము పోసినచోట వ్యాపించుట ప్రధాన లక్షణము. ఆకలి అధికముగ నుండును. అధిక మూత్ర విసర్జనయు సంభవించును ఈ మధుమేహాది వింశతి మేహములు విరుద్ధ ఆహార విహారముల వలన సంభవించును.

ప్రాథమిక దశయందు ఆయుర్వేద మందుల వలన సులభముగ తగ్గును మధ్యస్థితియందు కష్ట సాధ్యము. మందు దీర్ఘ కాలము వాడవలసియుండును.

సకల మేహములను నివారింపగల ఔషధములలో సర్వశ్రేష్ఠమైనది వసంతకుసుమాకరము.

1 సువర్ణభస్మము 2 తులములు, రజితభస్మము 2 తుల ములు, వంగ_సీస_లోహ_కాంతభస్మములు మూడేసి తులాలు రస_అభ్రక_ప్రవాళ భస్మములు నాలుగేసి తులములు కల్వములో ఉంచి ఆవుపాలు, చెరకు, అడ్డసరము అను కషా యములతోను చందనము, పట్టివేరు, కురువేరు, పసుపు అను వాని కషాయములతోను, అరటిగడ్డ దామెర_జాజిమొగ్గలు_ అనువానిరసములతోను వేర్వేరుగ ఏడేసిమారులు భావనచేసి పిదప కస్తూరితో భావనచేసి తయారుచేయవలెను.

గుణము:_ 20 మేహములు తప్పక తగ్గి తీరును. ఇందు బంగా రము ఉండుటచే మంచిబలము కలుగును ఇంద్రియపుష్టి, శరీర కాంతి కలుగచేయును. ఆయుర్వేదమందలి త్రిరత్నము లలో ఇది ఒకటి దీనిని అప్పుడప్పుడు వాడుచుండిన మేహ రోగములు రావు. మూత్రవ్యాధులును రావు. "రమయేత్ప్రి మదా శతం" అని ఆయుర్వేద గ్రంథముచే బహుధా ప్రశంసిం పబడిన దివ్యౌషధరాజము.

2 లొద్దుగచెక్క, తుంగ ముస్తెలు, కరక్కాయలు, గుమ్మడు వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి అందు కొలదిగ తేనె కలిపి సేవించిన మధుమేహము శమించును.

3. నేరేడు గింజలు, తంగేడు గింజలు సమభాగాలుగ చూర్ణించి మేడిచెక్క లేక వేరు కషాయముతో (¼ ఔన్సు) రెండు పూటల పుచ్చుకొనిన మేహములు అతిమూత్రము తగ్గును.

4 నేరేడుగింజలు 40, వేపగింజలు 40 బాగ్గుగా ఎండించవలెను. షుమారు 5 కాకరకాయలను చిన్న చిన్న ముక్కలుగ తరిగి బాగుగా మంచుటెండలో ఎండించవలెను ఈ మూడింటిని మెత్తగ చూర్ణము చేసి మూతి వెడల్పగు సీసాలో పోసి యుంచుకొనవలెను. ఒక టీ స్పూను పౌడరు ఒక కప్పు మేక పాలలో బాగుగా కలిప ఉదయమే త్రాగవలెను. ఒక గంట అయిన తరువాతనే అల్పాహారము తీసికొనవలెను. ఇట్లు ఒక మండలము తీసికొనిన మధుమేహము తగ్గును

గమనిక :— అన్నము తినరాదు. పంచదార, బెల్లము వాడరాదు గోధుమ రొట్టె, రాగులతో చేసిన చపాతీ, తీసికొనవలెను చపాతీలలో కాకరకాయ కూర పెట్టుకొని తినవలెను. సాధారణముగ చేదు, ఒగరు పదార్థములను తినుట మంచిది తీపి వస్తువులు పనికిరావు అధిక శ్రమ, నిరంతర ప్రయాణములు పనికిరావు.

5 మోదుగు విత్తుల కషాయములో కొద్దిగ సూరెకారం కలిపి ఇచ్చిన మూత్రకృచ్ఛ్రము హరించును. మూత్రము జారీ యగును.

6. పాలకూర చెట్టు, బూడిద గుమ్మడికాయ - వీని గుజ్జు రసము పది తులాలు, 1 తులం పసుపు, ఎఱ్ఱ రంగుగల బియ్యపు తవుడు 2 తులాలు ఇవన్నియు కలిపి రేపు మాపు 5, 6 దినములు తీసికొనిన అతిమూత్రము కట్టును.

## 18. గర్భవతులగుటకు

1. బలామూలం, చక్కెర, అతిబలామూలం, ఇప్పపూలు, మఱ్ఱిచిగుళ్లు, నాగకేసరాలు, సమభాగములుగ చేసి పొడిచేసి తేనె, నేయి కలిపి పాలతో తీసికొనవలెను

2. ఋతుస్నానము చేసిన ఉదయమే పెన్నేరుగడ్డల కషాయం ½ ఔన్సు, అర ఔన్సు పాలతో కలిపి కొంచెము ఆవు నేయి కలిపి త్రాగవలెను (ఇట్లు 6 నెలలు సేవింపవలెను).

3 పుష్యమీనక్షత్రముగల రోజున లక్ష్మణామూలమును తీసికొని ఆవు పాలతో కన్యకచే నూరించి ఆ కల్కమును ఋతుస్నానమును చేసినరోజు ఉదయమే సేవించవలెను.

4. గంగరావిచెట్టువేరు, జీలకఱ్ఱ, తెల్లవెంపలివేరు _ వీనిని కల్కముచేసి ఋతుస్నానము చేసిన వెంటనే ఆవుపాలతో సేవించవలెను. (పుత్రుడు కలుగును).

5. మోదుగవిత్తులను నల్లగ భస్మము చేసి నీళ్లతో కలిపి సేవించినను స్త్రీ గర్భవతియగును.

## 19. కాకవంధ్యానివారణ

మొదట ఒక సంతానము కలిగి తరువాతగర్భము ధరించనివారు కాకవంధ్యలు అనబడుదురు. ఈ యోగమట్టివారికి,

1. విష్ణుక్రాంతము సమూలముగ తెచ్చి నీడను ఎండించి చూర్ణించి పాలతో భావనచేసి వెన్నతో మూడు రోజులు (ఋతుకాలమున) పుచ్చుకొనవలెను. మూడు నెలలు అట్లు చేసిన తప్పక గర్భవతియగును.

2. ఏనుగుపల్లేరు చెట్టు మంచినీటితో బాగుగా కడిగి నీరు వడబోసి, ఆ శుభ్రమగు నీటిని క్రొత్త కుండలో ఉంచి, పై చెట్టును ముక్కలు చేసి అందు వేసి కాచవలెను. దానిని వడబోసి ఋతుస్నాతచేత త్రాగించవలెను. ఈ కషాయము ఎప్పటికప్పుడే తయారుచేయవలెను గాని నిలవది పనికిరాదు. మూడు నాలుగు నెలలు సేవించిన తప్పక గర్భవతియగును. పులుసు వాడరాదు.

## 20 తెల్లజుట్టు నల్లనగుట

అకాలముననే— అనగా 30 సంవత్సరముల లోపుననే కొందరికి జుట్టు తెల్లబడును. అట్టివారికి మందులు—

1. త్రిఫలములు, లోహభస్మము, దానిమ్మపట్ట, తామర తూళ్లు, ఒక్కొక్కటి 5 ఫలములు. చూర్ణించి ఇనుప పాత్రలో వేసి అందు గుంటకలగర రసమును ఆరు ప్రస్థములు పోసి, దానికి మూతపెట్టి చీలమన్ను బిగించి ఒకమాసము భూస్థాపితము చేయవలెను తరువాత దీనిని మేకపాలతో కలిపి రాత్రులందు లేపనము చేసి తలపైన ఆముదపు టాకులు వేసి గుడ్డకట్టవలెను. ఉదయమే స్నానము చేయవలెను. ఈవిధముగ పదిరోజులు చేసిన శిరోజములు నల్లబడును.

2. త్రిఫలములు, నీలి ఆకు, లోహచూర్ణము, గుంటకలగర ఇవి సమభాగములుగ మేక మూత్రముతో నూరి శిరస్సునకు పట్టించవలెను. ఇట్లు ఒక మండలము చేసిన కేశములు నల్లబడును సందేహము లేదు. దీనిని భృంగరాజాది చూర్ణము అందురు.

3 వెఱ్ఱిపుచ్చకాయ విత్తుల నుండి పాతాళయంత్రముచే తైలము తీసి ప్రతిదినము వ్రాసికొనవలయును.

4. త్రిఫలములు, గుంటకలగర. ఇను పచూర్ణం, నల్లబంక మన్ను సమభాగములుగ చూర్ణించి చెరకురసములో వేసి ఒక నెల పిదప దానిని లేపనముగ ఒక మండలము వాడవలెను. దీనిని లోహాది లేపనము అందురు

5. మూడు ఉసిరికపండ్లు, రెండు కరక్కాయలు, ఒక తాడికాయ, ఐదు మామిడి పప్పులు, ఒక తులం లోహచూర్ణం వీనిని ఇనుప పాత్రలో వేసి నూరి, ఆ పాత్రలోనే ఒక రాత్రి ఉంచి తరువాత వాడుకొనవచ్చును. దీనికి "ఆమ్లాది లేపనము" అని పేరు.

## 21. వాజీకరణములు

ఇంద్రియపుష్టిని కలిగించు ఔషధములను వాజీకరణౌషధములందురు పంచబాణరసము వంటివి బంగారము కలియు మందులగుటచే సామాన్యులకందుబాటులో నుండునవి కావు లేహ్యములలో మదనకామేశ్వరివంటి వాటికి ఆ శక్తియున్నను కష్టసాధ్యములు అశ్వగంధి, రత్నపురుష లేహ్యములను వాజీకరణవములని కొందరు అందురు. అవి స్వప్నస్ఖలన, శీఘ్రస్ఖలనములకును, స్పెరంటోరియా అను వ్యాధికిని బాగుగ పనిచేయును. పూర్ణచంద్రోదయాదులను ఇందు కలిపి వాడిన అమోఘముగా పనిచేయును. కాని అవి అధిక ద్రవ్య సాధ్యములు సులభమగు యోగములు ఇవి.

1. యష్టిమధుకము చూర్ణించి అందు తేనె, నేయి కలిపి తిని పాలు త్రాగవలెను. (2 చెంచాల పొడి మోతాదు) ఒక మండలం విధిగా సేవించాలి. భోజనమైన తరువాత (రెండు పూటల) చక్రకేళి అరటిపండులను తినుట మంచిది.

2. అతిమధురము, పిప్పళ్లు, వెదురుప్పు, చల్లపిల్లిగడ్డలు, నేలగుమ్మడిగడ్డ సమముగ చూర్ణించి అందు ఖండశర్కర కలిపి పుచ్చుకొనవలెను.

3 ఉసిరిక వరుగు, సన్నపల్లేరుకాయలు చూర్ణించి అందు తిప్పసత్తు, నెయ్యి కలిపి సేవింపవచ్చును.

4 తెల్లగురుగింజల చూర్ణము పాలతో పుచ్చుకొనేది.

5 తెల్లగురుగింజల చూర్ణము, తీలకోవెలవిత్తులు, ఏనుగపల్లేరుకాయలు చూర్ణించి పాలు, చక్కెర, నేయి కలిపి ఉడికించి సేవింపవచ్చును.

6. నేలగుమ్మడిగడ్డను చూర్ణించి నేయి 1 తులం, తేనె అర తులం కలిపి అత్తిపండంత ప్రతిదినము తినవలెను.

షరా:_ 4,5,6 యోగములు తెల్లజుట్టు నల్లబడుటకును ఉపయోగపడును

## 22 వృష్యయోగములు

1. ఉచ్చటీకంద (గుండ్రని తుంగముస్తెయొక్క వేరు) చవ్యము, యష్టిమధుకము _ వీనిని పొడిగ చేసె ఒక వస్త్ర

మున మూటకట్టి దానిని పాలలో 3 గంటలకుపైగా నాననిచ్చి ఆపైన కాచి వడగట్టి చక్కెర వేసి ఆ పాలను త్రాగిన వృష నాయకుడగను. (రెండు పూటల ఒక మండలం)

2. నేలగుమ్మడి వేరు, పాలపండ్లు, దూలగొండివేరు _ వీటిని పాలలో నాననిచ్చి కాచి వడబోసి పంచదార చేర్చి త్రాగవలెను.

3. సింగాణిగడ్డలు, ములువెలగ (చాగపండ్లు) యష్టిమధు కము _ వీనిని క్షీరకాకోలితో నూరి పాలు, చక్కెర కలిపి లేత మంటపై నుంచి పొంగుబూరెలవలె తృప్తియగువరకు తినిన అనేక స్త్రీలను రమింపగలరు.

4. నేలగుమ్మడివేరు, దూలగొండివేరు, చూర్ణం చేసి చక్కెర, తేనె, నేయి చేర్చి అందు తగినంత గోధుమ రవ్వను కలిపి ఉండలుగా చేసి తినుచుండిన అపారసంభోగశక్తి కలుగును. (వా. కా సూ. 1632)

5. షడంగామృతము _ తేనె, నేయి, చక్కెర, యష్టి మధుకము రెండేసి ఫలముల చొప్పునను, మధురసం 1 తులం ఒక ప్రస్థము పాలలో చేర్చి చక్కెర ముద్దయగునట్లు ఉడక పెట్టవలెను. వృష్యము, ఆయుష్యము కలుగును

6. ఊరపిచ్చుక గ్రుడ్లచొనలో పొట్టు తీసిన నువ్వులను పోసి, సింగాణి గడ్డలు, ములవెలగపండ్లు, దూలగొండి విత్తన ములు, గోధుమరవ్వ, మినపసున్ని కలిపి చక్కెర, పాలను చేర్చి జావగాకాచి త్రాగుచుండవలెను. (వా. కా. సూ.)

అనుపానములు— బాగుగా తయారుచేసిన మినపసున్ని ప్రతిదినము తినుట మంచిది. (అపకరము చేయు ప్రమాద మున్నది) చక్రకేళి అరటిపండు లనుచుండవలెను ఆనపకాయ (సొరకాయ) అనకూడదు.

## 23 కేశవృద్ధికి

1. పల్లేరు, నువ్వులపువ్వులు__ ఇవి సమభాగములుగ స్వీకరించి ఎండంచి పొడిచేసి దానికి సమముగ నెయ్యి, తేనె కలిపి శిరమునకు వ్రాసిసిన శిరోజములు వృద్ధిచెందును.

2. ఏనుగు దంతపుమసి, రసాంజనము__ వీటిని మేకపాలతో నూరి శిరోజములు ఊడినచోట వ్రాసిన మరల మొలచును. ఇది శరీరమున ఎచ్చట వ్రాసినను తప్పక కేశములు మొలచును, వృద్ధిపొందును.

## 24. ఇంద్రలుప్తమునకు

1 చేదుపొట్ల ఆకురసం మూడురోజులు తలకు (పేనుకొరికినచోటు) వ్రాసిన శిరోజములు మొలచును

2. చిన్నములకరసమున తేనెను కలిపి వ్రాసినను, గురిగింజవేరు రసములో తేనెను కలిపి పూసినను, జీడిఆకు రసములో తేనెను కలిపి లేపనము చేసినను ఇంద్రలుప్తము పోవును.

3. అతిమధురము, నల్లకలువ, ద్రాక్ష, వీటిని నువ్వులనూనె, ఆవుపాలు, నెయ్యి__ వీటితో నూరి పూసిన ఇంద్రలుప్తరోగము పోయి కేశములు మొలచును.

## 25. మొటిమలు

1. లొద్దుగచెక్క, ధనియాలు, వస - వీటిని సమభాగములు చేసి నీటితో నూరి ముఖమునకు పట్టించి ఒక గంట ఆగి తరువాత స్నానము చేయవలెను ఒక నెలలో మొటిమలు, మచ్చలు హరించును.

2 గోరోజనము, మిరియాలు - వీటిని సమముగ గ్రహించి నీటితో నూరి ముఖమునకు వ్రాయవలెను

3 తెల్లఆవాలు, వస, లొద్దుగచెక్క, సైంధవలవణము సమభాగాలు వీటిని నీటితో నూరి ముఖమునకు లేపనము చేసిన ఒక నెలలో దీర్ఘకాలమునుండియున్న మొటిమలు, వాటివలన ఏర్పడిన మచ్చలు పోవును.

4. పండిన మఱ్ఱి ఆకులు, జాజిఆకులు, రక్తచందనము, చంగల్వకోష్టు, మాసిసుపు, లొద్దుగచెక్క - వీటిని వేపాకు రసముతో నూరి ముఖమునకు పట్టించి ఒక గంట ఉంచి తరువాత స్నానము చేయవలెను. మొటిమలకిది రామబాణము వంటిది ముఖకాంతిని కలిగించును. మచ్చలు పోవును.

## 26. శ్లీపదము (ఏనుగు కాలు)

1. ఉమ్మెత్తాకులు, ఆముదపాకులు, నల్లవావిలి ఆకులు, తెల్లగలిజేరు, మునగపట్ట, తెల్లఆవాలు - వీటిని సమభాగాలు చేసి నూరి బోదకాలునకు పట్టించుచుండిన 40 రోజులలో దీర్ఘకాలమునుండి బాధించు బోదకాలు తప్పక తగ్గును (మూడు సంవత్సరములపైన తగ్గుట కష్టమే)

2 నిత్యానందరసము _ మాత్రలు ఉదయము సాయంకాలము సేవించుచు విడంగాది తైలము పైకి మర్దన చేయుచుండిన బోదకాలు తగ్గును.

## 27. ఉపదంశమునకు (కొరుకుడు)

1. గన్నేరు వేళ్ళను నీటితోనూరి పట్టించిన సకల ఉపదంశ వ్యాధులు మానును పుండ్లు తగ్గును.

2 త్రిఫలములను ఇనుపపాత్రలో వైచి కాల్చి బూడిద చేసి దానిని తేనెతో కలిపి పూసిన పురుష మర్మావయవమందలి ఉపదంశ వ్రణములు మానును.

3 రసాంజనము, దిరిసెనము, కరక్కాయలు_వీటిని సమ భాగములుగ చేసి మెత్తగ పొడిచేసి తేనెతో కలిపి వ్రాసినను ఉపదంశరోగవ్రణలు మానును.

## 28. స్తనాదుల వృద్ధికి

1. మిరియాలు, సైంధవలవణము, పిప్పళ్లు, గ్రంధితగరం, ములకపండ్లు, ఉత్తరేణవిత్తులు, నల్లనువ్వులు చంగల్వకోష్టు, యవలు, దిరిసెనపు కాయలు, పెన్నేరుగడ్డ _ వీటిని సమ భాగములుగ చూర్ణముచేసి తేనెతో కలిపి కుచ భుజ కర్ణముల యందు మర్దింమటువలన పయోధరోన్నతి కలుగును. సాధనమునకు మర్దించిన నదియు వృద్ధి పెందును.

2 తెల్లపూలుగల పెన్నేరుగడ్డ, సైంధవలవణము _ వీటిని పొడిచేసి 4 రెట్లు నెయ్యి, నెయ్యికి 4 రెట్లు మేకపాలు

గ్రహించి అందు పైపొడిని వేసి పాలు ఇగిరి నేయి మిగులు నంతవరకు కాచవలెను. దానిని లేపనము చేయుటయు మంచిదే (పు).

(అ) మోదుగఫలము, మేకమేడు - వీటిని నూరి నువ్వుల నూనెలో కలిపి కొంచెము గా తేనె కలిపి శిశ్నయోని లేపనము వలన దృఢత్వమునొందును.

(ఆ) మామిడిజీడిగు, కర్పూరము - వీటిని నూరి తేనెలో కలిపియైనను వాడవచ్చును

## 29 ఎనీమా = వస్తికర్మ

రోగములు కుదుర్చుటకు ప్రాచీన వైద్యులు వమన విరేచనాది కర్మలలో వస్తికర్మకు (ఎనీమా) అగ్రస్థానము నిచ్చిరి. మానవులకు కలుగు అనేక వ్యాధులు ఔషధములు లేకుండగనే ఎనీమావలన తగ్గునని వారి అభిప్రాయము.

**దీని విశిష్టతకు ఒక నిదర్శనము .—**

నా మిత్రులలో ఒక న్యాయవాది భార్యకు ప్రసవించిన తరువాత పది రోజులలో తల విసురుడు ప్రారంభమైనది. క్రమముగ పరిస్థితి విషమించుచున్నది నెల్లూరు నుండి కొనిపోవుటకు అనుకూలవాతావరణము. నేను ఎనీమా యిప్పించి చూడమన్నాను. వారు మొదట జంకి ఒక డాక్టర్‌ను అడిగి వచ్చి ఇచ్చినారు విరేచనమయిన వెంటనే దుర్లక్షణములు శాంతించినవి. సుఖముగ నున్నారు.

వస్తికర్మ (ఎనీమా) ఆయుర్వేదము మనకు ప్రసాదించిన మహా వరప్రసాదము.

జ్వరములలో భేదిమందు వాడరాదు. విరేచనమైనగాని జ్వరముతగ్గదు. అటువంటప్పుడు ఇదే శరణ్యము. నేను ఎనీమా వలన అనేకులకు రోగములను కుదిర్చితిని.

## 30 ఉదావర్తము (ఎక్కిళ్లు)

ఎక్కిళ్లు అజీర్ణవాయువువలన కలుగుచుండును. హిస్టీరియాలో మొదట ఇవి కనుపెంచుచుండును వీటికి ఈ ఔషధములంతగ పనిచేయువు. దానికి రసరాజరసము-- అశ్వగంధి-- ఈ రెండే మందులు-- దివ్యౌషధములు. అజీర్ణాదులవలన కలిగిన ఎక్కిళ్లకు మందులు.

1. మిరియాలు 4, 5 ఒక ఔన్సు నీటిలో వేసి పొంగించి గోరు వెచ్చగా ఉన్నప్పుడు త్రాగించవలెను.

2 నెమలి ఈక కాల్చి ఆబూడిదను తేనెతో నాకించవలెను.

3 ఆవాలు నూరి పొత్తికడుపు మీద పట్టించవలెను

4 శ్వాస సాధ్యమైనంతగ ఆపియుంచుచుండినను తగ్గును.

5 నాభిమీదను పైనను పట్టి వేయవచ్చును.

6 గోరువెచ్చని నీటిలో కూర్చున్నను ఎక్కిళ్లు తగ్గును.

## 31. బ్లడ్ ప్రెషర్ (Blood Pressure)

సాధారణముగ రక్త ప్రవాహవేగమున అల్పత్వ అధికత్వములు (Low and high pressure) పైత్య వాతములచే ఏర్పడును దీని నివారణకు ఆయుర్వేదమున దివ్యౌషధములు కలవు. ఒక పూట స్వర్ణసూర్యావర్తి ఒక పూట బృహద్వాత చింతామణి యుక్తానుపానములతో నిచ్చిన ఈ వ్యాధి

తగ్గితీరును. సందేహము అక్కరలేదు. దీనికి కొన్ని అనుభవ యోగములు కలవు.

1. శొంఠిపొడుం, ధనియాలు పాలతోగాని అల్లము, జీలకఱ్ఱ, ధనియాలు శీతల కషాయముగాని ఒక మండలం త్రాగవలెను.

2. వెల్లుల్లి రసం పాలలో కలిపి రెండు పూటల (రసం 10 చుక్కలు, పాలు 1 ఔన్సు) ఒక మండలం త్రాగవలెను ఇది బ్లడ్ ప్రెషర్‌కే కాక పక్షవాతమునకును పనిచేయును. వాత వ్యాధులను దగ్గరకు రానియ్యదు. (వెల్లుల్లిలో ఆ గుణము కలదు).

3. శొంఠిపొడుం రెండు రెట్లు పంచదారలోగాని బెల్లమున గాని చేర్చి పాకంపట్టి యుంచుకొనవలెను. రెండు పూటల కుంకుడుకాయంత తినుచుండుట చాలా మంచిది.

4. భావన అల్లం, భావన జీలకఱ్ఱ మూడు పూటల (రెండు కలిపి 1 చెంచా) తీసికొనుచుండవలెను.

గమనిక:_ వాత పైత్యహరములగు పదార్ధములు వాడవలెను. వాత పైత్య ప్రకోపకరములగు చామగడ్డ, వేరు శనగ వంటి వాటిని విసర్జింపవలెను.

## 32. బాలాతిసారములకు

1. అతివస, కరకపూవు, తుంగగడ్డలు _ ఒక్కొక్క తులం. వీటిని మెత్తగ పొడి చేసి కొలదిగ (చిటికెడు) తేనెతో కలిపి ఇచ్చిన అతిసార విరేచనములు కట్టును.

2 గసగసాలు, సోపు (తాంబూలమున వాడునది) - ఈరెండంటిని కొలదిగ నీరు పోసి దంచివడగట్టి ఆ రసమును రోజునకు 3, 4 మారులు సేవించవలెను.

3. పిప్పళ్ళు, మంజిష్ఠ, తుంగగడ్డలు, కరకపూవు సమ భాగాలుగ చూర్ణించి చిటికెడు తేనెతో ఇవ్వవచ్చును.

4. కర్పూరాదిరసమాత్రలు, కర్పూరాద్యరిష్ట వాడవచ్చును. వీటికిని తగ్గకపోయిన అత్యధిక శక్తివంతమైన యోగము - సిద్ధమకరధ్వజ, జాజికాయతోబాటు సానపై మూడు చుట్టులు సాది ఇచ్చిన ఎటువంటి విరేచనములైనను కట్టితీరును. ఒక మోతాదు చాలు. తప్పితే 2 గంటల వ్యవధానములో రెండవమారు ఇవ్వవచ్చును చంటిపిల్లలకివ్వవలసి వచ్చిన మాతృస్తనాగ్రమున ఈమందు పూసి పాలు త్రాగించవలెను. (సంవత్సరంలోపు పిల్లలయిన)

## 33. క్షీరవర్ధకములు

1. నేలగుమ్మడు గడ్డను పాలతో నూరి ఆ రసమును పంచదార కలిపి పాలతో సేవించిన స్త్రీకి స్తన్యము వృద్ధి చెందును.

2 తామరవిత్తుల చూర్ణమును పాలతో త్రాగినను, తామర తూండ్లు ఏడు రోజులు తినినను స్తన్యవృద్ధి యగును.

3 పెన్నేరుగడ్డ, శతావరి సమభాగములుగ చూర్ణించి రెండేసి చెంచాల పొడి పాలతో త్రాగవలెను.

4. పిల్లిగడ్డలను పాలతో నూరి శర్కర కలిపి సేవింపవలెను.

5. పిప్పలిచూర్ణము (ఒక చెంచా) 4 ఔన్సుల పాలలో వేసి కాచి పంచదార కలిపి త్రాగునది.

## 34 నత్తికి

1. తేనెలో మొమ్మాయి కలిపి నాలుకకు పట్టించుచుండవలెను.

2. నాలుకకు తేనె వ్రాసి బంగారు వస్తువుతో గీయుచుండిన నత్తి పోవును.

3. చదివినంతనే కొందరికి నవ్వు కలిగించినను దీనికి అనుభవ యోగము ఒకటి కలదు ండు సంవత్సరములు సంస్కృతభాషను నేర్చుకొనిన నత్తి పోవును. 6 మాసములకే గుణము కనుపించును. సంవత్సరానికి సగం తప్పక తగ్గును. ఈ విధానమున అరుగురికి తగ్గుట నేను చూచితిని. సం॥

## 35 పేలకు

1. సీతాఫలములోని గింజలను అరుగదీసి తలకు 5 రోజులు పూసిన పేలు పోవును 3, 4 గంటలుండి తలంటుకొనవచ్చును.

2 కాకుమాని గింజలు పొడి చేసి నూనెలో వేసి రెండు రోజులు ఎండలోనుంచి తరువాత తలకు పది రోజులు వ్రాయవలెను.

## 36. అజీర్ణమునకు

1. శొంఠి నిమ్మపండ్ల రసములో మూడు రోజులు నానబెట్టి ఎండించి చూర్ణము చేసి 1 తులము పొదుమున

5 తులవ ంల పంచదార పాకమున వేసి దానిని పూటకు అర తులం తినుచుండిన అజీర్ణము హరించును. వాతనొప్పులు పోవును.

2. 3 తులాల అల్లము శుభ్రముచేసి చిన్నచిన్న ముక్కలు చేసి ఆరుతులాల పంచదార పాకములో వేసి పూటకు అరతులం చొప్పున మూడు రోజులు తినవలెను. అజీర్ణము, పైత్య వాతము హరించును

3. తాత్కాలికాజీర్ణములకు— అల్లమును పలుచగ తరిగి చిన్నగరిటలో కొలదిగ నెయ్యివేసి అందు అల్లపు ముక్కలను వేసి దోరగ వేయించవలెను చివర ఒక అర చెంచా జీలకఱ్ఱ కూడ వేసి (రుచికి తగినంత ఉప్పు వేసికొనవచ్చును) భోజ నమునకు మొదట మూడు ముద్దలలో కలుపుకొని తినవలెను. ఇట్లు రెండు మూడు పూటలు తినిన అజీర్ణము పోవును.

## 37. ఆర్తవజనకములు

స్త్రీలకు ఋతుప్రవృత్తిని క్రమపరచువాటిని ఆర్తవ జనకములందురు.

1 నల్లనూవుల కషాయమున బెల్లము కలిపి ప్రాతః కాలమున సేవించుచుండిన ఋతుప్రవృత్తిక్రమమగును.

2 నల్లనూవులు, ఇరికి చెట్టు వేరు, నల్లజీలకఱ్ఱ - వీని కషాయము చల్లారిన తరువాత బెల్లము కలిపి మూడు దిన ములు త్రాగిన నిస్సందేహముగ ఆర్తవము జనించును.

3 చేదుసొరగింజలు, పిప్పలి, బెల్లము, మంగకాయ, సురాబీజము (సారాయిమడ్డి) యవక్షారము, ఆకుజెముడు

పాలు—వీనిని సమభాగములుగ మర్దించి వత్తిని చేసి యుక్తిగ యోనియందు ధరింప చేసిన ఆర్తవము ఒసంగును

## 38. నాశికారోగములు

1. ముక్కునుండి రక్తముగారుట

కొందరికి అప్పుడప్పుడు అకారణముగనే ముక్కునుండి నెత్తురు కారుచుండును. చల్లని నీరు నెత్తిపై పోయుచున్న ఆ రక్తస్రావము తగ్గును ఒకప్పుడు దీనికిని తగ్గదు అటువంటప్పుడు ఉసిరికవరుగును నేతితో నూరి శిరమున లేపనము చేసిన, ఎఱ్ఱిగడ్డ తిని మజ్జిగ త్రాగినను, నాశికారక్తము హరించును.

2. పీనస వ్యాధి లక్షణము ·

ముక్కడచికొనుట, ఎండుట, నీరుకారుట, పొగవెడలునట్లుండుట, వాసన తెలియ కుండ టు, మరియు కొందరికి శ్వాసపీల్చుట కష్టమగును. కొందరికి ముక్కులో కండరము అర అంగుళము వరకు పెరుగును వీటన్నిటికి ఔషధము — పెరుగులో మిరియపు పొడి, పాత బెల్లము కలిపి సేవించుట, గోధుమరవ్వను అన్నముగా వండి అందు నెయ్యి వేసి లనుచుండిన సకల పీనస వ్యాధులు పోవును.

## 39. అండవృద్ధి

విరుద్ధాహార విహారములవలన అధోముఖముగ సంచరించు వాతము దుష్టమై వృషణములయందు వ్యాపించి వాపును నొప్పిని కలిగించును. ఒక వృషణముగాని రెండును గాని వృద్ధిపొందవచ్చును. ఈ అండవృద్ధి వాత–పిత్త–శ్లేష్మ–

రక్త-మేదో-మూత్ర-అంత్రజములని సప్త విధములు. వీటన్నిటికిని ఔషధములు —

1. మ్రానిపసుపు, పసుపు వీనిని చూర్ణము చేసి అర తులము గోమూత్రముతో కలిపి త్రాగవలెను.

2. జీలకఱ్ఱ, సోపు, చెంగల్వకోష్టు, ఆవుపేడ, రేగు-వీనిని కలితో నూరి లేపనము చేసిన అండవృద్ధి తగ్గును.

3. క్రానుగాకు, జిల్లేడాకు, గలిజేరాకు-వీనిని మెత్తగ నూరి లేపనము చేసిన ఎటువంటి అండవృద్ధియైనను పదిరోజులలో తగ్గి తీరును.

4. చిట్టాముదపు వేరు, వావిలివేరు, ములుగోరింట వేరు-వీనిని సమభాగములుగ పొడి చేసి కషాయము కాచి (అర ఔన్సు) అందు చిటికెడు సైంధవలవణము, అరచెంచా ఆముదము కలిపి త్రాగుచుండిన సప్తవృద్ధులు హరించును.

5. చాగవేరు కషాయములో ఇంగువ, శొంఠి, సైంధవ లవణము, పిప్పళ్లు-పాలిక తులము లేక ఒక్కొక్క గ్రాము దంచి మెత్తని పొడి చేసి కలిపి ఉదయమున పదిరోజులు త్రాగుచుండిన సప్తవృద్ధులు తప్పక హరించును. కషాయము అర ఔన్సునుండి ఒక ఔన్సు వరకు వయస్సును బట్టి.

## 40. కుష్ఠరోగము

ఈ వ్యాధి కలుగుటకు కారణములు- మూత్ర పురీషాది వేగముల నవరోధించుట, అన్నము తిన్నవెంటనే అధిక వ్యాయామము - శారీరక శ్రమ చేయుట, భోజనమైన వెంటనే

మైధునము చేయుట, విరుద్ధాహార విహారములు అనేకములు శాస్త్రములందు చెప్పబడినవి. అన్నిటిని పర్యాలోచించి చూడ జన్మాన్తర కర్మయే కారణము అనిపించును.

దీని నివారణకు సూర్యోపాసనయే ప్రధానమైనది.

రోగలక్షణములు :

చర్మమున సర్పృజ్ఞానము నశించును. ఆ ప్రదేశము వివర్ణమై మొదట నిగనిగలాడుచు కొలదిగ పొంగరించును. దద్దుర్లు ప్రారంభమగును. దురద ఉండును. క్రమముగ పుండు ఏర్పడును. సాదారణముగ రక్త ప్రసరణ తక్కువగా ఉండు తావులలో ఈ వ్యాధి పుట్టును కర పాదాగ్రముల యందును, చెవుల పైభాగములయందును కలుగుచుండును.

ఈ వ్యాధి 18 భేదములుగు నుండునని మాధవనిదానాదులయందును, శ్విత్ర విసర్పి కుష్ఠములను రెండింటిని అదనముగ చేర్చి 20 భేదములని బసవరాజీయాది గ్రంధముల యందును కలదు. ఈ కుష్ఠభేదములలో అత్యధికములు సాంక్రామికములు శయన బోజన స్పర్శనములవలన ఒకరినుండి మరియొకరికి సంక్రమించును. (ఇది అటువంటి వ్యాధి కాదందురు కొందరు).

చికిత్సలు :

.1 బాగుగ శుద్ధి చేసిన గంధకము, త్రిఫలములు_వీనిని చూర్ణము చేసి గుంటకలగరాకు రసముతో ఒక వత్సరము సేవింపవలెను,

2. మంజిష్ఠ, తుంగగడ్డలు, కొడిశవేరు, తిప్పతీగ, చంగల్వ కోష్టు, శొంఠి, గంటు భారంగి, చిన్నములక, వస, వేపచెక్క పసుపు, మ్రానిపసుపు__ త్రిఫలములు__ చేదుపొట్ల__ కటుక రోహిణి__ చాగమట్ట, వాయువిడంగాలు__వేగిసచెక్క__ చిత్ర మూలము_పిల్లిపీచరగడ్డ_పిప్పలి_కొడిశవిత్తులు_అడ్డసరపాకు__ గుంటగలిజేరు_తెగడ_దేవదారుచెక్క_ అగరుశొంఠి_చంద్రచెక్క రక్తచందనము_సీమనేలవేము_బావంచి విత్తులు_ రేలకాయల గుజ్జు_పెద్దఉేకు పట్ట_పెద్దవేము_గానుగచెక్క_ అతివస_ కురు వేరు_పెద్దపాపర వేరు_దురదగొండి వేరు_సుగంధిపాల వేరు_ పర్పాటకము_ఇవి సమభాగములుగ తెచ్చి యుంచుకొనవలెను. వీటి చూర్ణమును (3 చెంచాలు) 8 ఔన్సుల నీటిలో వేసి నాలుగు ఔన్సులగునట్లుగ కాచి అందు శనగ గింజంత గుగ్గి లపు చూర్ణము వేసి వడగట్టి త్రాగవలెను. రెండు పూటల ఒక సంవత్సరం సేవించిన 20 కుష్ఠములు తప్పక తగ్గును: స్పర్శజ్ఞానము కలుగును.

ఉపదంశ_శ్లీపద_నేత్రరోగములు, సకల చర్మవ్యాధులు నశించును పైకి మరీచాది తైలము వ్రాయవలెను. దీన్నిని బృహన్మంజిష్ఠాది కషాయమందురు

**3. మరీచాది తైలము.**

మిరియాలు హరితాళకము, తెగడ, రక్తచందనము, తుంగముస్తెలు, మణిశిల, జటామాంసి, పసువు, మ్రానిపసుపు, దేవదారు, పెద్దపాపరవేరు, వాడగన్నేరు వేరు, చంగల్వకోష్టు, జిల్లేడుపాలు, ఆవుపేడ రసము _ ఇవి ఒక్కొక్కటి కర్షము శుద్ధిచేసిన వసనాభి ¼ పలము _ వీటిని కల్కము చేసి అందు తెల్ల అవనూనె 1 ప్రస్థమును నూనెకు రెట్టింపు (2 ప్రస్థములు)

గోమూత్రమును నీటిని పోసి తైలపక్వముగ కాచి వడగట్టి ప్రతిదినము శరీరమునకు వ్రాయుచుండిన 20 కుష్ఠములును నశించును.

4. ఖదిరారిష్ట.

చండ్రచావ 1 తులము, దేవదారుపట్టు 1 తులము, బావంచాలు 12 పలములు, మ్రానిపసుపు 20 పలములు, త్రిఫలములు 20 తులాలు _ వీటిని చూర్ణము చేసి 8 ద్రోణ ముల నీటిని పోసి 1 ద్రోణము మిగులునట్లు కాచి వడగట్టి అందు తేనె 2 తులాలు, శర్కర 1 తులం, ఆరెపూవుల పొడి 20 తులాలు, తక్కోలములు, నాగకేశరాలు, జాజికాయలు, లవంగములు, ఏలకులు, లవంగపట్ట, లవంగపత్రి _ వీటి చూర్ణము ఒక్కొక్కపలము, పిప్పలి చూర్ణము 4 పలాలు వేసి, దీనిని నేతితో మాగిన కుండలో పోసి మూతి బిగించి చీల మన్ను పూసి ఒక మాసము ఉంచవలెను ఆ తరువాత దీనిని వడగట్టి అర ఔన్సు మందు, అర ఔన్సు నీరు కలిపి భోజన మైన తరువాత రెండు పూటల త్రాగవలెను.

గమనిక: తైలమును పైపూతకు ఎల్లప్పుడు వాడవచ్చును. కషా యము మొదటి చూర్ణముతో ఉదయ సాయంకాలములు ఖదిర భోజనమైన తరువాత వాడుచుండిన ఆరు మాసములలోనే ఎటువంటి భయంకరమైన కుష్ఠము తగ్గిపోవును.

పథ్యము: యవలు, పెసలు, కందులు, చిరుశనగలు, గోధు మలు, పాతవడ్లు, కొఱ్ఱలు, చేదుగల కూరలు, పొట్లకాయ, చండ్ర, వేపపువ్వు, ఇంగువ, కాయకూరలు, ఆకుకూరలు వాడతగినవి.

అపథ్యము పులుసు, ఉప్పు, కారము, పాలు, పెరుగు, బెల్లము, నల్లపెసలు, పప్పు, మినుములు విసర్జింపతగినవి.

## 41 పక్షవాతము

ఈ వ్యాధికి కారణములు— అతిమైథునము, మలమూత్ర బంధనము, సప్తధాతుక్షయము, చింతాదుఃఖముల ఆధిక్యము, అత్యధిక ప్రయాస మొదలగునవి ప్రధానకారణములు. ఈ కారణములవలన వాతము ప్రకోపించి నానావిధ వాతరోగము లను కలిగించును. ఈ వాత వ్యాధులు 80 విధములుగ వివ రింపబడినవి. అశీతి వాతములలోను సర్వాంగవాతము అతి భయంకరమైనది పక్షవాతము (కుడి చెయ్యి, కాలు లేక ఎడమ చెయ్యి కాలు_ఒక ప్రక్క) మొదటిసారి వచ్చినపుడు ప్రమాదకరము కాదు. రెండు మూడు నెలలలో తగ్గును రెండవసారి వచ్చిన ప్రమాదమే మూడవసారి అసాధ్యము.

అశీతి వాతములకు ప్రత్యేకముగ 80 ఔషధములు వైద్య గ్రంథములందు చెప్పబడినవి పక్షవాతమునకు స్వర్ణ వాతరాక్షసము. రాజశిరోభూషణమునంటి మందులు అల్లపు రసము తేనెలతో వాడిన తప్పక తగ్గును. వాతవ్యాధి భేదము గుర్తింపలేనియెడల అశీతివాతములపైనను చక్కగ పనిచేయగల దివ్యౌషధములను మహర్షులు అనుగ్రహించినారు. మొదటిది బృహద్వాతచింతామణి. రెండవది షడ్వర్గ సిందూరము వీటి మూల్యమధికమైనను అమూల్యమగు పనిచేయును అర్కక్షీర తైలము పైన పూయవలెను. ఈ వ్యాధి కనుపడిన వెంటనే మంచి తేనెను త్రాగించవలెను. వెల్లుల్లి, అల్లము కూడ బాగుగ పనిచేయును.

ఒక యోగము— మిరియాలు, పిప్పలి, త్రిఫలములు, శుద్ధి చేసిన రసగంధక_వసనాభి_వెలిగారములు — వీనిని సమభాగ ములుగ చూర్ణము చేసి నల్లతుముకి, పెద్దములగ, బ్రహ్మమేడి, భావంచి విత్తులు వెలగ అల్లము గుంటకలగర — అను వాని రసములతోను మూడు దినములు మర్దించి భావన చేసి ముద్ద చేసి గాజుకుప్పెలో ఉంచి చీలమన్ను పూసి ఎండించి వాలు కాయంత్రమున రెండు ఝాములు మందాగ్నితో వండి అందు అడవిపంది, మేక అనువాని చేదులతో రెండు దినములు భావనచేసి గురిగింజలంత మాత్రలు చేయవలెను. ఈ మాత్ర లను రెండు పూటల త్రికటుక త్రిఫల కషాయముతో సేవించిన పక్షవాతము ఒక మండలము లోపుననే తగ్గును.

2. జిల్లేడుపాలు, మేకపాలు, వావిలాకురసం, చింతాకు రసం, నూనె— వీనిని సమభాగములుగ కలిపి ఒక కుండలో పోసి తైలపక్వముగ కాచి శరీర భాగములకు పూయుచుండ వలెను.

3. పావురాయి రక్తము పైకి రాయుటయును కలదు.

ఈ రోగి వాడతగినవి —

వంకాయ, ములగకాయ, కాకరకాయ ముల్లంగి, కంద, ప్రాతబియ్యము, బూడిద గుమ్మడి కాయ, మినుములు, ఉలవలు, గోధుమలు, నూనె జీలకఱ్ఱ, ఇంగువ, తేలికగ జీర్ణమగునవి, వేడిచేయునవి వాడవచ్చును.

అపథ్యములు: దోసకాయ, సొరకాయ పెసలు, బీరకాయ, పెరుగు, అజీర్ణకర పదార్థములు శీతల ప్రదేశము వర్జింపతగినవి.

---

# విశేషాంశ వివరణ

## 1. తైలపక్వ విధి

**పాకములు:—**

తైల ఘృతములు నశ్యానికి మృదుపాకము, తలంటుకు శరీరమునకు పూసికొనుటకును ఖరపాకము (మృదుపాకమని కొందరి అభిప్రాయము) ఇతర కర్మలకు మధ్యపాకముగను ఉండవలెను.

కల్కమందు కొంత జలాంశము ఉండిన, పట్టుకొని చూచిన వేళ్లకు పూశినట్లుండిన మృదుపాకము అనబడును. వత్తివలె చేసి తాకి చూచిన, మృదువుగను, జలాంశరహితముగను ఉండిన మధ్యపాకము.

కల్కము ఇంచుక ఉండచేసి కంచుపాత్రపై వేసిన గాజు పూసవలె మోగును. దానిని ఖరపాకము అందురు.

లేతపాకము నిర్వీర్యముగను, అగ్నిమాంద్యము కల్గించునదిగను, గురుత్వము చేయునదిగను ఉండును.

**తైలము:—**

నిప్పుమీద వేసిన "చిట చిట" శబ్దము లేనిచో పక్వమైనదని గ్రహింపవలెను. మరియు నురుగు కట్టుటయు కనపడును.

**ఘృతము:—**

పక్వమైన, నురుగు అరిపోవును. సువాసన వచ్చును. ఘృతము, తైలము మొదలగువానిని ఒక దినముననే సిద్ధము

చేయవలెను. ఘృతతైలాదులు కషాయములందు ఊరినచో, విశేషగుణము కలవి అగును

తైలమును పాత్రయందు పోసి మూడు దినములు క్రమముగా క్వాథములు, పాలు, కల్కద్రవ్యములు వీనిని చేర్చి పక్వము చేయుచు, పాకావసానమున కస్తూరి, చందనం, పచ్చ కర్పూరం, అగరు కురువేరు, కచూరాలు, రక్తచందనము మొదలగు సుగంధ ద్రవ్యములను చేర్చవలెను.

## 2 శ్వాసాదుల చలన గణనము

### 1. నాడి Pulse

ఏడాదివరకు నిముషమునకు 120_140

2 మొదలు 5 సం॥ వరకు 90_115

6 నుండి 15 సం॥ వరకు 80_90

16 నుండి 50 సం॥ వరకు 70_75

50 సం॥ పైన — 50_65

స్త్రీలకు 10 అధికముగా నుండును.

### 2. శ్వాస Respiration

ఏడాది బిడ్డ నిముషానికి 35

2 మొదలు 14 సం॥ 25

15 సం॥ పైన — 18_29

3. ఉష్ణోగ్రత **Temparature**

| | వేడి | నాడి | శ్వాస |
|---|---|---|---|
| సామాన్యముగ | 98.4 F | 80 | 18 |
| | 100 | 100 | 22 |
| | 105 | 150 | 34 |

మామూలు వేడిపైన ప్రతి డిగ్రీకి 10 సార్లు హెచ్చుగా నాడి, 2 సార్లు ఎక్కువగా శ్వాస ఉండును.

4. రక్తపు పోటు **Blood Pressure**

Sostolic 110-135

Diastolic 75-15

Average difference between Systolic and Diastolic is 50

Normal Blood pressure – 90 or 100

ఒక వ్యక్తి వయస్సునకు దీనిని చేర్చుచుండవలెను.

ఉదా: ఒక వ్యక్తి వయస్సు 40. వాని రక్తపు పోటు 40 + 100 = 140 ఉండవలెను.

3. తూకములు

1 కర్షము = 1 తులము = $11\frac{1}{3}$ గ్రాము

1 పలము = 3 తులాలు

1 ప్రస్థము = 8 తులాలు

1 శరావము = 32 తులాలు

1 కుడవము = 16 తులాలు

1 ఆఢకము = 256 తులాలు

1 ద్రోణము = 1 ఆఢకము

1 శాణం = మాడ = $\frac{1}{3}$ తులం (ఆర్ధరీయం)

1 చిన్నం = $\frac{1}{30}$ తులం ,,

1 నిష్కం = $\frac{1}{4}$ తులం ,,

1 మాష = $\frac{1}{12}$ తులం ,,

1 ద్రోణము = 25½ పౌనులు (1020 తు)

కొలత శేరు 30 తులాలు

తూకపు శేరు 24 తులాలు

## 4. కొల్తలు

60 చుక్కలు = 1 డ్రాం

8 డ్రాములు = 1 ఔన్సు

16 ఔన్సులు = 1 పౌను (40 తులాలు)

5 మిల్లి లీటర్లు = 1 టీ స్పూన్

4 టీ స్పూన్లు = 1 టేబిల్ స్పూన్

2 టేబిల్‌స్పూన్లు = 1 ఔన్సు

## 5. పారిభాషిక పద వివరణము

1. త్రిఫలములు: — కరక, తాడి, ఉసిరిక.
2. త్రికటుకములు : — శొంఠి, పిప్పలి, మిరియము.
3. బలాచతుష్టయము: — బల, అతిబల, మహాబల, నాగబల.

4. చతుర్భద్రికములు: — శొంఠి, అతివస, తిప్పతీగ, తుంగముస్తెలు.

5. పంచాంగములు: — చెట్టుయొక్క వేరు, ఆకు, చెక్క, పండు, పూలు.

6. పంచవల్కములు: — రాగి, మేడి, జువ్వి, మఱ్ఱి, కలుజువ్వి — వీటిపట్టలు

7. తృణ పంచమూలములు: — రెల్లు, దర్భ, కాకిచెరుకు, కాశగడ్డి, శాలి తృణము.

8 పర్ణి చతుష్టయము: — శాలిపర్ణి, పృశ్నిపర్ణి, మాషాపర్ణి, ముద్గపర్ణి.

9 దశమూలములు: —

ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెదములక, పల్లేరు, మారేడు, నెల్లి = తిలకత్వక్, పెదమాను, పెగ్గుమ్ముడు, కలిగొట్టు.

పక్షాంతమున: —

కోలపొన్న, తోకపొన్న, వాకుడు, ములక, పల్లేరు, మారేడు, కూరవెల్లి, తుందిలము, గుమ్ముడు, పాదిరి.

10. పంచ మూలములు: —

1. ముయ్యాకుపొన్న, కోలపొన్న, పెదవాకుడు, చినవాకుడు, పల్లేరు, (ములక) వీనివేళ్లు.

2. మారేడు, కూరవెల్లి, దుందిలము, పెగ్గుమ్మడి, కలిగొట్టు.

3. గలిజేరు, ముద్గపర్ణి, మాషపర్ణి. ముత్తవపులగము, ఆముదపుమొక్క.

4. జీవకము, ఋషభకము, మేద, పాలకూర. పిల్లిపీచర.

5. కాకిరెల్లు, కాకిచెరుకు, దర్భ రెల్లు, కరివేరు

11. సప్తధాతువులు: —

రసము, రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్రము.

12. కల్కము: —

పచ్చి ఔషధద్రవ్యములను మెత్తగ నూరి దానినుండి తీసిన రసమును, ఎండిన ఔషధ ద్రవ్యములను నీటితో మెత్తగ నూరి దానినుండి తీయు రసమును కల్కము అందురు.

13. శీతకషాయము — హిమము:—

ఔషధద్రవ్యములను దంచి ఒక కుండలో పోసి, ఆరు రెట్లు నీరు పోసి ఒక రాత్రి నాననిచ్చి ఉదయమున ఆ ద్రవ్యమును బాగుగా పిసికి వడకట్టగా వచ్చిన నీటిని శీతల కషాయము అనియు హిమము అనియు అందురు.

14. చూర్ణద్రవము (ఫాంటము):—

బాగుగా కాగిన నీటిలో ఔషధ ద్రవ్యములను వేసి పిసికి వడకట్టగా వచ్చిన నీటిని చూర్ణద్రవము (ఫాంటము) అందురు.

15. క్వాథము :—

కషాయమును శృతము, క్వాథము, నిర్వ్యూహము అందురు. "శృతః క్వాథః కషాయశ్చ నిర్వ్యూహస్సనిగద్యతే" అని

ప్రమాణము కషాయద్రవ్యమును క్వాథమనియు కొందరు వ్యవహరింతురు.



16. అవలేహము :—

కషాయాదులను చక్కెర పాకమువలె గట్టిపడునట్లు మరల కాచుటను రసక్రియ, అవలేహము లేహము అని అందురు.

అవలేహాన్ని పరీక్షించు విధము – చేతితో తీసిన తీగవలె సాగవలెను. ఉండచేసి నీటిలో వేసిన మునగవలెను. ఇట్లున్న చక్కగ పక్వమైనట్లుగ గ్రహింపవలెను.

17 స్వరసము :—

ఆకులను, చెట్టుపట్ట, వేళ్ళు – మొదలగువానిని శుభ్రము చేసి దంచి వడగట్టిన వచ్చెడు రసమును స్వరసము, అంగ రసము అందురు. ఎండిన ద్రవ్యములకు రెండింతలు నీరు పోసి ఒక రోజు నాననిచ్చి మరునాడు వడగట్టిన, ఆ రసమును గూడ అంగరసమని వైద్యులు వ్యవహరింతురు.

18. కషాయ పంచకము :—

స్వరసము కల్కము క్వాథము హిమము చూర్ణద్రవము— వీనిని కషాయపంచకమందురు వీడు ఉత్తరోత్తరం శక్తి హీనము.

19. పంచత్వక్కులు :—

మఱ్ఱి, రావి, అత్తి, జువ్వి, మామిడి — వీని పట్టలు.

20. పంచపల్లవములు :—

మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలము, మారేడు—వీని చిగుళ్లు.

21. జీవనీయములు –
ఆయుర్దాయమును పెంచునవి_ జీవకము, ఋషభకము, మేద_ మహా మేదలు, కారుపెసర _ మినుములు, మనుబాల, అతిమధురము.

22. బృంహణీయములు :–
శరీరమునకు బలము కలిగించునవి. నేలగుమ్మడి, పాల గుమ్మడి, పెన్నేరుగడ్డవంటివి.

23. భేదనీయములు :–
మలాదులను భేదించునవి (వెలువరించునవి)_తెల్లతెగడ, ఆము దపు చెట్టు, కటుకరోహిణి వంటివి.

24. దీపనీయములు :–
జఠరాగ్నిని వృద్ధి చేయునవి _ శొంఠి, అల్లం, మిరియాలు, పిప్పలి వంటివి.

25. రసాంజనము :–
మాని పసుపుకు 8 రెట్లు నీరు పోసి 1 భాగము మిగులునట్లు కాచి దానికి సమముగ మేకపాలు పోసి గట్టిపడువరకు ఇనుప పాత్రలో కాచి ఎండించి చేసిన పొడి.

26. పుటపాకము:–
పచ్చివనస్పతులను దంచి ముద్దచేసి దానిని నేరేడు మొదలగు ఆకులలో చుట్టి రెండు లేక ఒక అంగుళము మందమున మన్ను లేపనము చేసి అది ఎఱ్ఱగానగువరకును పిడకల పుటంబున ఉంచి తరువాత దానిపై మన్నును ఆకులను తీసి లోపలి ముద్దను పిసికి రసమును తీసికొనుట.

27. చాతుర్జాతకములు :—

ఏలకులు, లవంగపు చెక్క, ఆకుపత్రి, నాగకేసరములు.

28 పంచలవణములు :—

సైంధవలవణము కాచలవణము, సముద్రలవణము, సౌవర్చ లవణము, బిడాలవణము.

29. పంచకోలములు —

పిప్పలి, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి.

30 భావన=ఊరబెట్టుట.

31 చర్ది :—

అన్నపానాదులయందు ద్వేషము కలిగి వమనము అగుట.

32. త్రిక్షారములు :—

సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము.

33 వాజీకరణము :—

వాజః శుక్రం, తదస్యాస్తీతి=వాజీ. అవాజీ వాజీ క్రియతే పురుషః అనేన ఇతి=వాజీకరణమ్=వీర్యవృద్ధి కలిగించుట.

34 రాజయక్ష్మ=క్షయ :—

సర్వరోగములకు రాజుగానుండుటవలన "రాజయక్ష్మ" అనియు శరీరమునందలి జఠరాగ్ని సర్వక్రియల క్షయింప చేయు చుండుటవలన "క్షయ" అనియు, సప్తధాతువులను శోషింప చేయుటవలన "శోష" అనియు ఈ వ్యాధికి నామములు.

సమాప్తము